ఫోను: 20[illegible]
సంపుటి 7

టెలిగ్రామ్: హిందీసంఘ
సంచిక ౮

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

*



*

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర
959 ఖైరతాబాదు, హైదరాబాదు_4

సంవత్సర చందా
రు. 4-00

ఆగస్టు
1960

విడిప్రతి
35 నయాపైసలు

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో



## గమనిక

గత సంచికలోని 44వ పేజీలో "ఆముక్త మాల్యదలోని పాండ్యుని కథ" కు బదులుగా "ఆముక్త మాల్యద—కేశిధ్వజుని ఉదంతము" అనియు. ఆ వ్యాసములోని "ఖాండిక్యుడు పేరును, "ఖాండిక్యుడు" అని యు చదువ గోరెదము. ఈ పొరపాటునకు పాఠకులు మన్నించ ప్రార్థితులు.

—సంపాదకులు

# ఏకలిపి

నేడు ఏకలిపి వాదము బలపడుచున్నది. ఈ బలమునకు రెండు కారణము లున్నవి. ఒకటి : మనము భిన్నత్వము నుండి ఏకత్వము లోనికి పోవుచున్నాము. రెండు : మన భాషలో సాజాత్య మెక్కువగా నున్నది. ఏకత్వము కొన్నిట ఆత్మతః, కొన్నిట అవయవములలో కొన్నింట పొలిమేరలలో, మరి కొన్నింట ఆశయములలో నుండును. ఈ ఏకత్వ భావన మన బుద్ధి వికాసములను బట్టి రూపాంతరములు బొందుచుండును. పూర్వము లేని ఏకత్వమును మనము క్రొత్తగా తెచ్చుటలేదు. ఐకమత్యమను మాటను ఏకత్వమను మాటతో సంస్కరించు చున్నాము. అనగా ప్రాచీనకాలములో భౌగోళికముగా ఏకత్వమును కోరిన మానవుడు భావములలో ఏకత్వము కోరుచున్నాడు. ఈ ఏకత్వ భావనయే భాషాపరముగ ఏకలిపిని కోరుచున్నది. దీని ద్వారా మన హృదయములను ఇంక కొంచెము సన్నిహిత పరచుకొన వీలు చిక్కుచున్నది. ఏకలిపి వాదము ఆచరణ యోగ్యమా ! కాదా ! యన్న విషయము విచారింప వలసి యున్నది.

భాషకు లిపితో దగ్గర సంబంధ మున్న మాట వాస్తవమేగాని భాషవలె లిపి స్వతస్సిద్ధము, ప్రత్యామ్నాయాసాధ్యము కాదు. లిపి లేకుండగనే చాల భాషలు చాల కాలము నడచినవి, నడచుచున్నవి. తెలుగువారు సంస్కృతమును తెలుగు లిపిలో చదువుకొను చున్నారు. టర్కీవారు తురుష్కమునకు రోమను లిపి నుంచినారు. చదువులేని వారికి లిపి లేకుండగనే భాష నడచు చున్నది. భాషలు మారుచున్న వేగముతో లిపులు మారుటలేదు. ఒకే లిపితో ఎన్నో భాషలను పలుకవచ్చును. ఈ కారణము వలన భాషకు లిపితో ఆత్మ సంబంధమున్న దన్న వాదమునకు విలువ లేకుండ పోయినది. ఆ యా భాషలనుండి తొలగించిన ఆ భాషలు పొందు దుఃఖము బహు స్వల్పము. ఇంతకూ

ఏకలిపిని తెచ్చి మనము సాధించున దేమున్నది యని కొందరందురు. భారతీయ భాషలలో శబ్దార్థ సామ్యముండుట యన్నదే ఈ ప్రశ్నకు తగిన సమాధానము. ఈ సామ్యమును అర్థము చేసుకొనుటకును, స్థిర పరచు కొనుటకును, వృద్ధి పరచు కొనుటకును మనము ఏకలిపిని కోరుచున్నాము.

ప్రస్తుతము మన ఆదర్శములు ఏక దేశీయములు. ఏక ప్రజా స్వామికములు. దీనికి ఏకలిపి యొక చిన్న సదుపాయము. దీనివలన వేరు భాషలు నేర్చుకొను వారికి కొన్ని చిక్కులు తప్పును. భాషా మర్మజ్ఞులకు కొంత లాభము చేకూరును. దేశీయులలో సాంస్కృతిక విశ్వాస మేర్పడును. అట్టి దానికి దేవనాగరి లిపి సర్వానుకూల మైన దనుట అందరు అంగీకరించిన విషయము. ప్రస్తుతము ప్రాంతీయ లిపు లను విడనాడక వాటితోపాటు దేవనాగరి లిపిని కూడ అభ్యసింప జేసిన ఈ లిపి - ఆదర్శము నిస్సందేహముగా ప్రయోగ సాఫల్యమును పొంద గలదని మా విశ్వాసము.



# అంతరార్థము

—శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

కన్నులలో రహించు నవకమ్ము దలంచిన జీవితమ్ము పై
నున్న విషాదమే తొలగి ఉన్నత భావ తరంగ డోలలన్
వెన్నెల పూఁత స్వప్నముల బ్రీతిమెయిన్ విహరింతు ప్రేయసీ!
ఎన్ని వసంతముల్ చనిన, నెంతగ మారిన నేమి బాహ్యముల్.

ముసలితనమ్ము వచ్చినది, మూర్ధము వంగి ధరాస్థలిన్ బరుం
డు సమయమ్మయె; పోవునె కఠోరత కాలము మ్రింగి వైచినన్
కిసలయ సూన శోభయును, కృష్ణ మనోహర వేణునాదముల్;
రసమయ లోక భావమయ రాజిలు ప్రేమ, సుధాస్మృతిన్ చెలీ!

కాలము, తర్కమున్, మన జగమ్మను బంధము వైచియుంచు; ఈ
జాలములో నిగుడ్కొని నిజమ్మరయంగల శక్తి లేక మ
ర్త్యాళి పరిస్థితిన్ వసరు వారికి దైవము చూపు త్రోవ యు
ద్వేల మతీతమౌ ప్రణయవేదన-మాధురి; శాశ్వతమ్మదే!

జగమును జెందు శక్తులటు, సర్వము ద్వంద్వ సమన్వయమ్ము, పై
కెగసెడు భావనా ప్రతిభ కృష్ణమయమ్ము, సమగ్ర, మేకమున్—
అగుట నెఱింగినంత ప్రణయార్థుల బంధమె విశ్వతత్త్వమై
మిగులును, 'కామి-దాసు'ల నిమిత్తము లేక లయించు భిన్నతల్

కనులకు దోచు అందములు, కానని భావవిలాసముల్, కలన్
గనబడి వాంఛయై నిలుచు కాల్పనికమ్మగు లోకముల్, స్మృతుల్,
పనులును, సర్వమున్ గలసి భాసిలు సత్యము-కాని విశ్వసిం
చిన నిలుమన్, త్యజించిన విశీర్ణత జెందు, రహస్యమింతియే!

నిండు మనమ్మునన్ నిలువ నీయవలెన్ ప్రణయమ్ము. దానినే
అందగ విశ్వసించిన యనంతర మాత్మను దోచు నిగ్రహ
మ్మొందియు లేనియట్లు మఱి యుంచక యుండిన రీతి ద్వైధమై
నిండు దనమ్ముగగ్గులు, నదె నిచ్చెన దివ్యపథమ్ము జేరగా.

అమృత పథమ్ము గోరి హృదయమ్మున విశ్వవిభూతి నిల్పి, భ్రాం
తిమెయిరహించు బాహ్యజగతిన్ క్షణికమ్మని యెంచి, వేదనల్
మమతలు దూరమై చన విమర్శయొనర్చి, తుదన్ భవాంతరా
ర్థము ప్రణయాశ్రితమ్మగు పదార్థముగాగ నెఱింగితిన్ చెలీ!



వ్యాసము:

# సందేశ ఘట్టమున సంభాషణా చాతురి

—శ్రీ ఎం. కులశేఖరరావు

కవి సార్వభౌముడు శ్రీనాథుడు రచించిన కావ్యములలో, పాండితీ ప్రకర్షచేతను, రసపోషణయందును, కథాకథన పద్ధతియందును, వ్యక్తిత్వ్యక్య మును పాటించుటలోను, ఆయన రచించిన శృంగార నైషధమే సర్వోత్కృష్ట మైనది. శ్రీహర్షుడు రచించిన గ్రంథమునకు మూలగులు సద్దును, అసన్యౌ సన్ని కమైన అనువాదమును శ్రీనాథుడు రచించినాడని పలువురు విద్వాంసులు, విమర్శకు లిదివరకే సూచించియున్నారు. అందుచేతనే కొందరు, శ్రీనాథుని గ్రంథములను పేర్కొనవలసి వచ్చినప్పుడు, శృంగార నైషధమును ప్రప్రథమ ముగా పేర్కొనుటయు అది అనువాదమను విషయము విస్మరించుటయు, సంభవించుచుండును. నైషధ మహాకావ్యమునకు శ్రీనాథుని పాండిత్యమునకు కల్పనాప్రతిభకు తగిన కావ్య వస్తువు లభించినది. అతనికి అభిమానమైన శృంగారము ప్రధాన రసముగా పొసగినది. కావ్యమునకు ఉత్కృష్టత కలిగినది.

శృంగార నైషధకావ్యమున అన్ని ఘట్టముల కంటె ఎక్కువ ప్రాధాన్యము నాపాదించు కొనిన సన్నివేశము సందేశ ఘట్టము. దమయంతి, నలుడు, నాయికానాయ కులయిన యీ కావ్యమున సందేశ ఘట్టముననే పరస్పరావలోకనము, పర స్పర సంభాషణము జరిగినవి. ఇంతకు పూర్వము నాయికానాయికు లొకరి నొకరు సందేశరుల ద్వారమున పరిచయము చేసికొనుటతోడనే గడిచినది. నలుడు, దమయంతి, పరస్పరము విన్నదానినిబట్టి ఒకరిపై నొకరికి ప్రేమాభి మానము లేర్పడుట, అట్టి యవస్థలో స్వయంవరమునకు పూర్వమే కలిసి కొనుట సంభవించి యీ సందేశ సన్నివేశమునకు పతాక స్థాయిని సమకూర్చి నవి. గ్రంథమున నింతటి ముఖ్య ఘట్ట మనియే దీనిని శ్రీనాథుడు బహు శ్రద్ధతో చిత్రించినాడు.

చతుర్థాశ్వాసమునగల ఈ ఘట్టమున ముఖ్య కథాంశ మిది. దమ యంతిపై మోహము కలిగిన ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు. నలుని తమ సందేశకునిగా నియమించి, అదృశ్యుడుగా నుండు శక్తిని ప్రసా

దించి, తమలో నొకరిని దమయంతి వరించునట్లు చేయుట కతనిని దమయంతీ శుద్ధాంతమునకు పంపించుట, నలుడు దమయంతి యెదుట ప్రత్యక్షమై తన్ను దైవదూతగా తెలియజేసికొని, దిక్పాలుర సందేశమును వినిపించి ఆమెను ప్రసన్నురాలిని చేయుటకు ప్రయత్నించుట, ఆ తరువాత తన్ను నలునిగా పరిచయము చేసికొనుట, ఈ కథా భాగమును చిత్రించుటయందు కవి సార్వభౌముడు అనంతశక్తియుతుడు. బహుముఖములుగా ప్రతిభ్రింపించినాడు. ముఖ్యముగా కథను అధికాంశము సంభాషణా రూపమున నడిపించుట ప్రత్యేకముగా చెప్పుకొనదగినది. కథను, కవి, కథలోని స్వరూపమును చెప్పుచున్నాడు రచనలో విచిత్రమైన మార్పులు చేయుచు బహువిధ వర్ణనలు చేయుచు, ఆ యా సందర్భాను అలంకారముల కూర్చుచు, హృద్యముగా రచించవచ్చును. కాని సంభాషణా రూపమున నున్న కథలో నీ విషయములన్నియు పాటించుట కష్టము. పాత్రల మనస్తత్వమును గురించి కవి తాను స్వయముగా చెప్పుటకు వీలులేదు. వారి భావములన్నియు వారు పలికెడుమాటలను బట్టియే తెలవలెను. పైగా కొన్ని విషయములందు మనసున్న రెండు భావములు కలిగినప్పుడు వాటిని వెలువరించుటకు పాత్రకునికి అందజేయవలెను. దీనికి నేర్పు నేర్పు అవసరము. రచనానిబంధమైన యీ నైపుణి శ్రీనాథునిలో సంపూర్ణముగా నున్నదని చెప్పుటకు అతడు రచించిన సందేశ ఘట్టమే చక్కని నిదర్శనము.

ఈ కథా భాగము, దిక్పాలుర సందేశమును గ్రహించి, అదృశ్యుడుగా నున్న నలుడు దమయంతి యంతఃపురమున ప్రకటితమగు సందర్భమున ప్రారంభమగుచున్నది. దృశ్యుడైన నలుని వర్ణించు మనోహరమైన ఉపమానములను కవి కల్పించినాడు. అందు 'జవనిక వాయందిట్టిక చిత్రరూపము రూప తెలుంగున' నలుడుండె ననుటలో జరుగబోవు నాటకీయత సూచ్యమైనది. ధీరోదాత్త నాయకుడగు నలుడు నీచమగు సందేశ కర్తవ్యమును నిర్వహించుచున్నను, అతని ఉదాత్తస్వభావమున కే మాత్రము భంగమును కలుగలేదు. దమయంతిని, త్రిలోకసుందరియగు తన ప్రియురాలిని ప్రత్యక్షముగా దర్శించినను అతనిలో చలనము కలుగలేదు. "పరమాద్భుతాస్త నిమేషముద్రుండును, నిర్ణిద్రరోమ ప్రరోహుండును, నిశ్చలాంగుండు" నుగానే ఉన్నాడు. ఈ త్రిలోక మోహనుని దర్శనమున దమయంతికి కలిగిన మనః పరివర్తనమును కవి సూక్ష్మముగా పరిశీలించినాడు. "అప్పుడమి తే

నింగనుగొని, సంభ్రమంబును, భయంబును, లజ్జయు, మనంబున" దమయంతిని పెనవేసినవి. విభ్రాంతయై యతని కులగోత్రములను ప్రశ్నించుట కుత్సహించిన దయ్యు "చంద్రుడో, యుపేంద్రుడో, కంతుడో, జయంతుడో!" అని సందియంబందినది. ఎంతటి సందేహమామెను నాక్రమించినను, ఆమెలో సూక్ష్మముగా గ్రహించు శక్తి కలదనుటకును, నలునే నిరంతరము ధ్యానించు చున్నదనుటకును నొక్క నిదర్శనము చాలును. నాడు, హంస నలుని రూపములు వర్ణించినప్పు డాతని సౌందర్యమును దర్శింపవలెనను కాంక్ష కలిగినది. తన కోరికను హంసకు తెలుపగా నాహంస తనకాలి గోరగోటితో పచ్చని పద్మపత్రముపై నలుని రూపమును చిత్రించి ప్రదర్శించినది. ఆ రూపమామె మనస్సున నిన్నినాళ్లుగా హత్తుకొని యున్నది. ఆ చిత్రరూపముతో నిపుడు ప్రత్యక్షముగా కనుపించిన నలుని రూపమును పోల్చుకొని ఇతడు నలసార్వభౌముడే యని నిర్ణయించు కొనుట కధికప్రయాస యక్కర లేకపోయినది. దీనిని కవి యిట్లు చెప్పినాడు: "హంసంబు సరసిజినీ పలాశంబు మీఁదఁ జరణనఖాగ్రంబున వ్రాయించి చూపినం జూచిన చిత్రరూపంబుతో రూపంబు సంవదించుటం జేసి యీతండు నైషధరాజని యెఱుంగ" నని.

ఈ సందర్భమున ఒక విచిత్ర పరిస్థితి యేర్పడినది. అంతవరకును, నలుడను విషయము దమయంతికి విదితమే. అతని మనోభావములు — తనకు సంబంధించినవి — కొంతవరకు తనకు తెలియును. అయినను, తన ప్రియుని, ప్రియునిగా ఆదరించి సంభాషించుటకు వీలులేదు. అందుచేతనే అతనితో అన్య పురుషునితో ప్రవర్తించి నట్లుండి, అతిథికి తగిన, "అర్ఘ్య పాద్యములు, మధుపర్కము, కాంచనపీఠము, పరిమ సేవా విధా విరచితాంజలి తోడ ప్రముదితంబగు మనః పద్మమును" సమర్పించి సత్కరించినది. ఈ సత్కారము తరువాత "నానా విధ చిత్ర వాగ్రచనా చాతుర్యమును" ప్రదర్శించినది. అది ఎట్లుండునో పరిశీలింతము.

తాను నివసించిన చోటికి కేతెంచిన నూతన వ్యక్తిని 'నీ వెవ్వరు?' అని సూటిగా ప్రశ్నించుట భావ్యముకాదు. అది మర్యాదాతిక్రమణము. వచ్చినవాడు నలుడనుట తనకు తెలిసినను 'నీ వెందులకు వచ్చితివి?' అనుటకూడ తగదు. అతని లోకోత్తర సౌందర్యమునకు ప్రభావితురాలైనది. తన మనస్సున నున్న సంశయము నిట్లు వెలిబుచ్చినది. "వలుడవో! యైలవిలు కూర్మి యాత్మజుడవో! పంచ బాణుండవో! దేవపతి సుతుడవో!

చంద్రుడవో !" ఇది యంతయు ఆమె మనస్సున నలుని రూపము కలిగించిన ప్రభావము యొక్క సందేహ పరంపర. ఆ తరువాత నొకమాట యనినది. "ఇంక పెక్కు భాషణము లేల? నిజము దప్పక చెప్పుము నిషధపతివా ?" ఈ మాటలతోతానింతవరకు నలుని గురించి కంతుడు, జయంతుడు అన్నది కేవలము మాటవరుసకే నట ! నిజము దప్పక చెప్పిన నాతడు నిషధ పతి యనుట స్పష్టము. ఇక నాతడు వచ్చిన కారణ మడుగుట నెంత మనో హరముగా కూర్చినదో చూడుము ! "నవ శిరీష సుమంబుల నవకమునకు- నన్ననదమ్ములు వోని నీ యడుగు దమ్ము- లెంత దూరమ్ము నడిపింప నిచ్చగించె- నొక్కొ నిర్దయమైన నీ యుల్లమిపుడు." ఈ మాటలలో అతని గౌరవమునకు లోపములేదు. ఈషత్ప్రశంస యున్నది. తానాతని సంభావించు విధానము కొంత బయల్పడినది. అతని అతిలోక సౌందర్య మును దర్శించుటవలన "ఏముకృతార్థుల మైతిమి. మా జన్మంబులు సఫలంబు లయ్యె. మా విలోచనంబులు భాగ్యంబుసేసె." అని తన సంతోషమును వెలిబుచ్చినది. "పంకరుహాయతాక్షి నును( బల్కులు తేనియ లొల్కుచుఁ శ్రవోలంకృతులై నృపాలు మది లగ్నములయ్యె, వినోద లీలకై మంకెన పూవు( జాపమున మన్మథుడేసిన తూపులో యనఁ." ఇందేమి యాశ్చర్య మున్నది ? దమయంతి వాఙ్మాధుర్యము నలుని కెంతటి యానందము కలిగించినవో, శ్రీనాథుని కల్పన పాఠకుల నంతటి ముగ్ధులను గావించినది.

ఈ ఘట్టమున రెండవభాగము నలుడు తన్ను తా నెఱింగించుకొని, తాను తెచ్చిన సందేశ వాక్యములను దమయంతికి నివేదించి, యామెను దిక్పాలురకు సుముఖురాలినిగా జేయు ప్రయత్నము. ఇటు నలుని యవస్థ యెట్టిదియో పరిశీలింతము. దమయంతి తన్ను నలునిగా గుర్తింపకున్నచో నెట్టి క్లేశము నుండెడిది కాదు. కాని, ఆమె తన నిజనామమును గుర్తించినది. ఆమె మాటలనుబట్టి తనను తన ప్రియుడుగా నామె భావించుచున్నట్లును తేట పడినది. కాని, ఆమె మనస్సున కొలది సంశయముకలదు. అది తనతో నధిక పరిచయము లేమిచే కలిగినది కావచ్చును. ఈ సంశయభావము నాధారముగా జేసికొని తన కార్యమును నెరవేర్చుకొనవలెను. ఇక తన నామె— తన ప్రియు రాలు- పొగడినప్పుడు మనుష్య సహజమైన అధిక భావము తన్నావరించినది. దానికి తాను దాసుడు కాకూడదు. అట్లైన తన దౌత్యము విఫలమే. తన మనస్సును నిగ్రహించుకొని, ఎదుటివారి మనస్తత్వమును పరిశీలించి, తగిన

మాటలు మాటాడుటకే కొంతసేపు ఆలోచించినట్లున్నాడు. అప్పుడు 'వింజ మాకిడినభంగి' నిశ్శబ్దమావరించినది. తరువాత "ప్రావృషేణ్యపయోధర ధ్వానగంభీరంబైన యెలుంగున' దమయంతి నుద్దేశించి తన సందేశమును వినిపించినాడు.

ముందు తన్ను తాను పరిచయము చేసికొనుట సందేశకుని విధి. ఇచట ఆ విధియేకాక దమయంతి యడిగిన ప్రశ్నమునకు సమాధాన మీయ వలసిన భారము తనపై నున్నది. కాని, ప్రస్తుతసందర్భమున నిజనామ మెఱింగించుట కార్యహానిని కలిగించునట్లున్నది. అందుకే 'ఏను దిక్పతుల యాస్థానంబు నందుండి— యరుగుదెంచితి నీకు నతిథి నగుచు', అని తనను గురించిచెప్పి 'పాకశాసన, పావక, ప్రేతరాజ పాశపాణులు పుత్తేర పని పూనివచ్చితి, చిత్తగించి యక్కార్యంబు విను, ముప్పురము పురుషులు పరి షన్మధ్యంబున పంకజాసను తనూభవుని వలన త్రిభువన మోహనంబులైన నీ రూపలావణ్య విలాసవిభ్రమాది గుణంబులువిని, వినుకలివలపంక నెంతయు జలించి పంచేషులుంతిత ధైర్యవిత్తంబులగు తమ చిత్తంబులంగల వృత్తాం తంబులంతయుం దెలియంజెప్పి, రిప్పు డయ్యాశాపతు లాశాపాశంబులఁ గట్టువడినారు". అని తాను వచ్చిన ప్రయోజనమును నివేదించినాడు. ఈ సందేశ నివేదనమున చమత్కార మున్నది. దమయంతికి తాను స్వయముగా నెంతటి యందగత్తెయో తనకు తెలియక పోవచ్చును. ఆమె సౌందర్యాది కమును సూచించిన మనుష్యాధికుని వరించుటకు దోహదకారి కావచ్చును. నారదు డామె విలాసమును దేవసభాముఖమున వర్ణించునట్లు చెప్పుటలోని పరమార్థమిది. ఇక నామె యందమం దెంతటి ప్రభావము కలదో తెల్పుటకే 'ఆశాపతు లాశాపాశంబులఁగట్టువడినా' రన్నాడు. ఇట శబ్దముల నుపయో గించుటలోను నేర్పున్నది. 'ఆశాపాశంబు కట్టువడిరి' యనగా పొందలేని వస్తువును వారు కోరుచున్నారనియే భావము. దిక్పాలురకు దమయంతీ సమాగమము అసంభవమని సూచ్యము. పైకట్లు కనిపించక సూచ్యప్రాయ ముగా భవిష్యత్కథను చెప్పునట్టిది. మనః పూర్వకముగా కవి యిట్టి శాబ్దిక రచన చేసినాడు.

ఇంద్రాదు లెంతటివారో వర్ణించి, వారు దమయంతీ విరహమువలన పడెడు బాధలు వర్ణించుట నలునికి గల రెండవ బాధ్యత. దీనిని కూడ కడు సమర్థతతో నిర్వహించినాడు. ఇంద్రుని విరహ వర్ణనాసందర్భమున నొక

పద్యము ప్రత్యేకముగా పేర్కొనదగినది. "మూఁడు కన్నుల వేల్పుతో మోహరించి-నేడు దేహంబు లేకయున్నాడు దాను-వేయికన్నుల వేల్పుతో విగ్రహించి-వనిత! యింకేమిగానున్న వాఁడొ మరుఁడు." ఈ పద్యమున వివిధములైన భావము లున్నవి. ముక్కంటియగు శివునికన్న సహస్రాక్షుడగు ఇంద్రుడధికుడనియు, నామె యాతనిని వివాహమాడిన హైమవతికన్న నధిక సౌఖ్యములందుననియు ఒక యభిప్రాయము. దమయంతీ వశమైన ఇంద్రుని మనస్సునామన్మథు డెంతగా బాధించు చున్నాడో సూచించుట మరియొకటి తనకై యింతగా తపించుచున్న పురుషుని వివాహ మాడుటలో దమయంతికి లభించబోవు సౌభాగ్యమును సూచించుట వేఱొకటి. ఇట్టి భావము లింత చిన్న పద్యమున నిమిడించుట మహాకవికి మాత్రమే సాధ్యము. తరువాత దిక్పాలురకు కలిగిన విరహ బాధను ప్రబంధోచితముగా వర్ణించుట జరిగినది. "ఆదిత్యులమగు మాకును-నీవోర్గతి కాయికంబు నిర్భరసుఖవ-ర్ణోదయ కారణమై సం-పాదించుంగాక తరుణి! పరివేషంబుల్" అని సాయూహిక ముగా కూడ దిక్పాలుర సందేశమును వినిపించినాడు. దూతకు గల బాధ్యత ఇంతటితో తీరిపోలేదు. వారిలో నొకరిని యామె వరించునట్లు తనవైపు నుండి కూడ ప్రయత్నించుట తన ధర్మము. "అమరపతిస్వరించినవో! హవ్యవ హలకా చరణంబు ప్రోక్కెదో, యమునిని చేట్టపట్టెదవో, సంగర వల్లభుఁ బెండ్లి యాడెదో, ప్రమదము కౌతుకంబు ననురాగము పెంపును సొంపుమీఱగా, గమలదళాక్షి, యొక్కరుని గైకొనుమా, యనుమాన మేటికిన్" అని యా ధర్మమును కూడ చక్కగా నిర్వహించినాడు.

సందేశ నివేదనానంతరము దమయంతీ నలులకు జరిగిన సంభాషణ మును పరిశీలించిన వాక్చాతుర్యమున నొకరికన్న నొకరు మించినట్లు కాన్పింతురు. నలుడు తన్నుగురించి యేమైన చెప్పునేమో యని దమయంతి యాశించినది. కాని దిశేశుల గొప్పతనమును మాత్రమే వర్ణించినాడు నలుడు. 'ప్రశ్న మొక్కటి - యొకటి ప్రతివచన' మైనది. "అధిక తరులైన గాని దిశాధిపతులు, కౌతుకము నాకు నీ వంశ కథలయందె" యను నభి ప్రాయమును వెల్లడించి, 'పను చేసిన ప్రశ్నంబున కుత్తరంబు నీ మీద నవ్వై యున్నది.' అని యతని కర్తవ్యమును జ్ఞప్తికి తెచ్చినది. ఇప్పటికిని నలుడు తన నిగ్రహమును వదలునట్లు లేదు. పైగా, 'పౌరదుగం దలంచెదవో? భీమ తనూభవ! యీ విచారముగా దూరము సేయు మెవ్వరికి దోషముగాఁ

దన 'పేరు చెప్పట' అని తన పరిజ్ఞానమును వెల్లడించు నట్లుగా నటించు కొన్నాడు. 'రాజవంశ కిరీటుండ'నని మాత్రము సూచించినాడు. దమయంతి మాటల నేర్పులో నాతని నిందించినట్లగపడును. 'పేరు చెప్పిన నీ కనాచారమేని, మాకు నాయందె నీతోడ మాటలాడ !' అని రాజవంశ సంబంధకమగు విధుల నామె పాటించినట్లుగా కనిపించినది. ఇట్టి 'ప్రతిబంధరచనా చాతుర్యంబునకు' నలుడే దమయంతిని యభినందించినాడు. అతనికి వేరొండు ప్రత్యుత్తరము స్ఫురించలేదు. అనగా నాతని వాక్కునామె అరికట్టినదన్నమాట కాని, ఇట్టి నిస్సహాయస్థితి యందును తన కర్తవ్యమును విస్మరించని నిశ్చల మనస్కుడు నలుడు. దివిజులలో నొకరిని వరించి తన దౌత్యమును సఫలము గావించు మన్నాడు. "నాకుగా నుద్ధరింపుము నాకవిభుల హస్తములు మోడ్చి వేడెద నాదరమున" అని ప్రార్థించినాడు. తర్కము, వాదప్రతివాదములు నిష్ఫల మగుచో ప్రార్థనయే కదా శరణ్యము ! దివిజులు మానవకాంతను కోరుట, వారి యాధిక్యమునకు తగనిపని. అనగా వారట్టిపని చేసి పతితులైనారన్న మాట. అట్టి పతనావస్థయందున్న దివిజుల దమయంతి యుద్ధరింపవలెనట ! ఒక పదమున నెంత వైచిత్రి! తరువాత దిక్పాలుర దీనావస్థను వర్ణించినాడు. దానికి సమాధానమిచ్చుట దమయంతి కిష్టమున్నట్లు లేదు. కాని, ఎదుటి వాని మాటకు ప్రత్యుత్తర మీయకపోవుట తిరస్కారమగును. కాబట్టి సమాధానముగా తాను దేవతలకు తగనిదాననియు, 'యారకూటకలాపమున్నమే కలవాని- కేనర్హనే నిర్జరేశ్వరులకు'అని తనయుక్తతను వ్యక్తము చేసినది. ఇంక వాదప్రతివాదములతో లాభములేదని, తన దృఢనిశ్చయమును "పసైపథుండ్రు నవశ్యంబువరింతు, నా ధరణినాథుండాత్మ నన్నొల్లడే ననుమానింపక యున్న నప్పుడున సంప్రాణంబు సద్భక్తిమై వనలోద్బంధన వారి మజ్జన విధా వ్యాపార పాటించితన్." అని తెలిపినది. ఇట్టి ఘోర నిశ్చయమును విన్నవాడు, ఎంతటి ధీరుడైనను కరిగిపోవువాడే. కాని, నలునికి లోకోత్తర శక్తి యున్నట్లున్నది. దమయంతి నిశ్చయమువగల ఆత్మహత్యా ప్రయత్నమునగల అనర్థములను తిరిగి వివరించినాడు. గొంతుకు త్రాడు బిగించుకొని మరణించినచో ఇంద్రుడు స్వర్గమున నిన్ను గ్రహించును. అగ్నికాహుతికాగ నాత్మ కోరుదువేని-జాతవేదుని యదృష్టము ఫలించు సలిలప్రవేశంబు సమ్మతించెదవేని-వంబుధీశ్వరుడు పుణ్యాంబు నేయు. అన్ని విధముల దిక్పాలురకే లాభము. దమయంతి వాదించుశక్తిని కోల్పోకున్నను సహనమును కోల్పో

యినది. "నీకు సాధ్యమైన నిషధభూపతిని వర్ణించు" మన్నది. నలుడు తన కర్తవ్యమును విస్మరించక దిక్పాల వర్ణనచేయుచునే యున్నాడు. దమయంతి యెంతటి శక్తి కలదియైనను అబలయే. స్త్రీ సహజమైన స్వభావ మామె నావరించినది. నిస్సహాయ స్థితిలో వేడియశ్రులు నిగుడంగ వెక్కివెక్కి యేడ్వఁదొడఁగె లతాంగి పృథ్వీశు మ్రోల-మృదులపరివేదనాతురోన్మిశ్ర మధుర-కంఠకాకువికారకాకలిక యలర"

దమయంతికి కలిగిన వేదనను నలుఁడు తెలిసికొని, సందేశకుడుగాకాక, నలునిగా ప్రవర్తించి, దమయంతి మనఃస్థైర్యమును గుర్తించి తన దౌత్యము విఫలమైనందులకు వగచుచు వెడలిపోవుట అనంతర కథ. సంభాషణ రూపమున నున్న యీ సందేశ ఘట్టమున నలదమయంతుల పాత్రలను ఒకరి నొకరు మించినట్లుగా చిత్రించి, వారు పరస్పరము వరించుకొనుటలో గల యోగ్యతను ప్రకటించినాడు కవి.



కవిత :

# ఏల ?

మూలం
రవీంద్రుడు

అనువాదం
శ్రీ దాశరథి

ఏల దీపమ్ము మలిగి పోయినది చెపుమ ?
వాతఘాతమ్ము నుండి కాపాడు కొఱకు
ఉత్తరీయాంచలమ్ము నడ్డుంచినాడ,
కనుకనే దివ్వె మలిగి పోయినది లెమ్ము !

ఏల పుష్పమ్ము వాడి పోయినది చెపుమ ?
గాఢమగు ప్రేమ పెల్లుబ్బగా బిరాన
మెత్తని సుమమ్ము గుండెకు హత్తుకొంటి,
కనుకనే పూవు వాడి పోయినది సుమ్ము !

ఏల వాహిని ఇంకి పోయినది చెపుమ ?
నా ప్రయోజనమున కయి ఈ ప్రవాహ
మెదురుగా ఆనకట్ట నిర్మించినాను,
కనుక వాహిని ఇంకి పోయినది లెమ్ము !

వల్లకీ తంత్రి ఇది తెగి పడిన దేల ?
తంత్రికి గలట్టి శక్తిని దాటినట్టి
స్వరము పలికింప నొక్కింతి బలముగాను,
కనుకనే తంత్రి ప్రీలి పోయినది సుమ్ము !



# భీమఖండము: పాఠపరిశీలనము

—శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

శ్రీనాథుని భీమఖండము (భీమేశ్వర పురాణము), వ్రాత ప్రతులలో పాఠములు చెడి, మారు రూపు పడియున్న గ్రంథము. ఆ గ్రంథమును, కీ. శే. కొత్తపల్లి వేంకట పద్మనాభ శాస్త్రిగారు పరిష్కరించి, ఇప్పటి కరవై యేండ్ల క్రిందట— అనగా 1901.లో అచ్చున కెక్కించినారు. ఆ ప్రతి యొక్కటియే యీ ప్రాంతమున ప్రచారములో నున్నది. నేను చదివినది వారి మూడవ కూర్పు ప్రతి. ఆ శాస్త్రిగారి పరిష్కరణము వలన గ్రంథము కొంతవరకు బాగుపడినది గాని, అపపాఠముల బెడద పూర్తిగా తొలగలేదు.

భీమఖండము పురాణమని పేరేగాని, గమ్యమైన కావ్యము. అందలి జటిల సంస్కృత పద గుంఫనలు సామాన్యపు చదువరులకు కొరుకుబడునవి కావు. బహు కావ్యపరిచయమును— లోకానుభవమును చాలినంత గలవారికేగాని, అందలి తెనుగు నుడికారముల తీయతియ్యదనము తెలియబడవు. శ్రీనాథుని కవిత్వమునందు— అందును భీమఖండమునందు— నాకు గల ప్రీత్యతిశయము చేత పలుమారు పఠించుటలో నాకగపడిన పాఠ దోషములు కొన్ని— నా కర్థమైనంతలో— నేనే సవరించుకొన్నాను. ఒక కొన్ని చక్కని సవరణలు, మన్మిత్రులు శ్రీ ఆకిలి శ్రీరామ శర్మగారి వలన తెలుసుకొన్నాను. 1950. లో శ్రీ నిడదవోలు వేంకటరావు పంతులుగారు, 'భాషా పరిశోధన' యను వ్యాసములో, సప్రమాణముగా నిర్ణయించిన సాధు పాఠములను గ్రహించినాను. ఈ విధముగా నాయొద్ద నున్న ప్రతిని దిద్దిపెట్టుకొన్నాను. కాని, నా బుద్ధి కందని, సవరణకు సాధ్యము కాని— అంశము లనేకము మిగిలియున్నవి. సమర్థులైన వారెవరును కలుగజేసుకొనక పోవుటచేత, ఆ యుత్తమ గ్రంథము సముచిత సంస్కారము లేక అట్లే పడియున్నది. రాను రాను కొత్తపల్లి వారి ప్రతియు దుర్లభమైనది.

ఇట్లుండగా, 1958. లో, శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారి పరిష్కరణముతో, 'అద్దేపల్లి అండ్ కో' వారి ముద్రణము కనుల పండు

వుగా వెలువడినది. కాని, (శ్రీ) శాస్త్రిగారి నూటయిరవై పుటల పెద్ద పీఠికతో గ్రంథము బలుపెక్కి వెల హెచ్చినది. హెచ్చిననేమి? ఆ కృతికి, ఆ వెలకు దగిన ఆకృతి సౌష్ఠవ మలవడి యున్నది— అందమైన అట్ట; ముచ్చటైన అచ్చు; మేల్తరపు కాగితము. వెల హెచ్చైనా సరి!

శాస్త్రిగారి పీఠిక భీమ ఖండపు చరిత్ర జిజ్ఞాసువులకు సహాయ కారిగా నున్నదనుటలో సందేహము లేదుగాని, పరిష్కరణము మాత్రము, భాషోపాసకులకు సహాయకారిగా లేదు. వారు పీఠిక వ్రాయుటలో కైకొన్న శ్రద్ధ పాఠములను పరిశీలించుటలో కనబరచలేదు. వెనుకటి తప్పు పాఠము లట్లే యున్నవి. మరికొన్ని క్రొత్తవి చేరినవి. వారు క్రొత్తపల్లి వారి ప్రతిని చూచినట్లు లేదు. అందువల్ల అందలి మంచి పాఠములు కొన్ని యిందులోనికి రాలేదు. మొత్తము మీద గ్రంథ మంతయు మరల పరిష్కరింప వలసి నట్లే యున్నది.

కావున, ఈసారి ముద్రణమున కుపకరించు నన్న భావముతో, ప్రాత క్రొత్త ప్రతుల పాఠములను చూచి, వాటిలోని గుణ దోషములను వివరించి, నాకు తోచిన మాటలను గూడా ఈ వ్యాసమున తెలుపుచున్నాను. కాని, యివి సిద్ధాంతములు కావు; సూచన మాత్రములు. ప్రత్యంతర పరిశోధనమువలనగాని నా యాశయముల కాగాము లేర్పడవు. భవిష్యత్పరిష్కర్తలు, ఈ రెండు విషయముల నవలోకించి, మంచి పాఠములను నిర్ణయింతురు గాక.

ఈ వ్యాసములో, ప్రాచీన ముద్రణ పాఠమునకు,— ప్రా. పా.— అనియు, శాస్త్రిగారి పాఠమునకు, శా. పా — అనియు సంకేతములు.

## 1. 'త్రస మింగము'

"కుసుమ సమయోహవతారను
రస ముంచెను జగము లంగరాగాంబునిధిన్" (5. 102)

అను పూర్వ పాఠమును, శాస్త్రి గారీ క్రింది విధముగా సవరించినారు.

"త్రస మింగము జగము ముంచె రాగాంబునిధిన్"

సవరణకు గల కారణమును, పీఠిక (పు. ౧౧౯)లో, ఇట్లు తెల్పినారు.—

"రస ముంచెను జగము లంగ రాగాంబునిధిన్" అనునది పూర్వ ముద్రిత పాఠము. ఈ పాఠము సర్వథా అన్వయము కుదరనిది. రస=భూమిని, అని యర్థము చెప్పినచో జగములు అనునది పునరుక్తి ప్రాయము. వసంతోదయము జగమును రాగసముద్రమున ముంచెనను విషయమిచట ప్రస్తుతము. ఆ పద్ధతిని అంగరాగాంబునిధి ననుకొనుట నర్థరహితము. 'జగ మనంగ రాగాంబు నిధిన్' అని మార్చుకొనినను పునరుక్తి దోషము తప్పనిదే యగును. దీనికి మూలమగు సంస్కృత శ్లోక మిట్లున్నది.

శ్లో. "చరా చరాత్మకం విశ్వం రాగాబ్ధౌ మధు వాసరః
న్యమజ్జయ జ్జయప్రీత హాజ్జా తోజ్జృంభ ణోజ్జ్వలః"

వసంత సమయము విజయ ప్రీతుఁడైన మన్మథుని యుజ్జృంభణమున నుజ్జ్వలమై, చరా చరాత్మకమైన జగము ననురాగ సముద్రమున ముంచెనని యీ శ్లోక భావము. 'త్రస మింగమ్ చరాచరమ్' అను నమర కోశోదాహృతిని బట్టి 'చరాచరము' అను దానికిఁ బర్యాయపదము 'త్రసమింగము' -అను పదము. జిహ్వాగ్రనృత్యత్సంస్కృత పద జాలుఁడైన శ్రీనాథుఁడు మూలాను గుణానువాదమునకై - 'త్రసమింగము జగము ముంచె రాగాంబు నిధిన్' అను పాఠమును గ్రహించెననుట నిర్వివాదమైన తథ్యము. కావున నీ పాఠమే యిట గ్రహింపఁదగియున్నది" అని శాస్త్రిగారి నిర్ణయము.

ఇక నామనవి.— పూర్వ పాఠమున అర్థము కుదురని మాట నిజమే గాని, శాస్త్రిగారి సవరణ మాత్రము సరియైనది కాదు,

వారు, "త్రసమింగము=చరస్థిరాత్మకము" అన్నారు. అది పొరపాటు. అసలు 'త్రసమింగము' ఏకపదము కాదు. త్రసము, ఇంగము-అని రెండు పదములు.- "చరిష్ణు జంగమ చరం త్రస మింగం చరాచరమ్" అని అమరకోశ పాఠము- చరిష్ణు; జంగమమ్; చరమ్; త్రసమ్; ఇంగమ్; చరాచరమ్- అని పద విభాగము. ఈ పదములన్నియు, జంగమ వాచకములు. అనగా, తిరుగు స్వభావముగల మనుష్యాదులయందు వర్తించునవి- అన్న మాట.

"త్రస్యతీతి త్రసం—త్రసీ ఉద్వేగే—భయపడునది.
ఇంగతీ తీంగం—ఇగి గతౌ—చరించునది.
భృశం చరతీతి చరాచరం—చర గతిభక్షణయోః—సంచరించునది."

అని వ్యుత్పత్త్యర్థములు. (గురు. ప్రబో.)

అప్టి, "ఇంగ - Moving" అని యర్థము చెప్పి:—

"త్వయా సృష్ట మిదం విశ్వం య చ్చేంగం యచ్చ నేంగతి"

అను భారత ప్రయోగము నిచ్చియున్నాడు.

మ్యానియర్ విలియమ్స్-తన నిఘంటువులో,— "త్రస- The collective body of moving or living beings, opposed to sthavara" అని (=త్రస శబ్దము జంగమముల యందేగాని, స్థావరములయందు వర్తించ దని) స్పష్టముగా వ్రాసియున్నాడు.

కాబట్టి, శాస్త్రిగారు త్రసమును-ఇంగమును కలిపి 'త్రసమింగ' మని మేకపదము చేయుటయు, ఏకపదమైన 'చరాచరము' లో, 'చర'—'అచర' అను రెండు పదము లున్నవనుటయు పొరపాటు.

"శ్రీనాథుడు జిహ్వాగ్రనృత్యత్సంస్కృత పదజాలుడు గనుక 'త్రస మింగము' ను వాడినా" డనుటయు, "ఇది తథ్యః" మనుటయు సరిగాదు.

పూర్వ పాఠమువలెనే-శాస్త్రిగా రూహించిన పాఠమును తప్పే ననియు, సరియైన పాఠమేమో యింకను విచారింపవలసియే యున్నదనియు ఈ చర్చలో తేలిన సారము.

## 2. 'ధూమోర్ణ'

"అధివాసము సేయు యముని శుద్ధాంతంబు
ధూపార్తి మహిసాక్షి ధూమకటిక" (3.60)

అని, పూ. పా. — శాస్త్రిగారు 'ధూపార్తి' ని 'ధూమోర్ణ' గా సవరించినారు. అందుకు కారణమును, పీఠిక (పు. ౧౧౮) లో ఇట్లు తెల్పినారు.

'ధూపార్తి - యను శబ్ద మనన్వితము. పరిష్కర్తల కది అగురు వర్తిగా స్ఫురించి యుండును. అగురువర్తిని ధూపార్తి శబ్దమున కర్థము చేసినపుడు ధూమఘుటికయను శబ్దమున కర్థము పొసఁగదు. ఇంతకు యముని భార్యపేరు ధూమోర్ణ. ఆమె వచ్చి దక్షిణ కాశిని మహిసాక్షి ధూపముచే సుగంధభరితము సేయుచు కైవారము సేయుచుండెనను విష యమును శ్రీనాథుఁడు మనకిట నెఱిఁగింపఁ దలఁచి యున్నాఁడు. ఈ విషయము సంస్కృత సంప్రదాయజ్ఞులకు మాత్రమే విదితము" అని వారి యూహేవ సిద్ధాంతములు.

ఇక నా మనవి ;- 'ఘూపాత్రి' యను, ప్రా. పా. తప్పు. దూపాత్రి అని యుండవలెను. ఆ పదము వైకృతము. 'దూపాత్రి' తత్త్వము ఆంధ్ర సంప్రదాయజ్ఞులకు మాత్రమే విదితము. 'దూపాత్రి = అగురువత్తి' యని తెనుగు తెలిసిన వారనుకొనరు. పూర్వ పరిష్కర్తలును అనుకొనలేదు. అది ధూపము వేయుట కుపయోగించు పాత్ర. తెనుగువారి యిండ్లలోని తెరవలును ఎరిగిన పదము. శ. ర. కర్త, "దూపాత్రి=దూపము వేసెడు పాదము పెట్టికతట్ట" అని చెప్పియే యున్నారు.

దూపాత్రిలో నిప్పులుంచి, ఆ నిప్పులపై గుగ్గిలమో, సాంబ్రాణియో చల్లుదురు. అప్పుడు సువాసనతో పొగ లేచును. అదియే ధూపసమర్పణము. యముని శుద్ధాంతము చేసిన పని యదియే. ఈ సంప్రదాయమును గమనింపక శ్రీ శాస్త్రిగారు 'దూపాత్రి'ని తీసివేసి 'ధూమోర్ణను' చేర్చినారు. దూపాత్రి లేక ధూమకార్య మసంభవము. కావున పద్యమున నుండవలసినది 'దూపాత్రి'యే గాని, 'ధూమోర్ణ' కాదు.

యముని శుద్ధాంతము (= యముని భార్య) అంటే చాలును. ఆమె పేరు చెప్పనక్కరలేదు. పద్య ప్రారంభమున — "గంధవాహుని యాలు కనవుసూడ్పు" అని మాత్రమే యున్నది. గంధవాహుని యాలి పేరు లేదు. ఇక్కడ ఉండవలసిన యవసరమేమి ? అక్కడ చెప్పక, ఇక్కడ చెప్పుట రచనలో ప్రక్రమ భంగదోషమగును. కాబట్టి "ధూమోర్ణ" పాఠము సరిపడదు.

మరియు శాస్త్రిగారు, "ధూమోర్ణ చిడిబాకాశిని ధూపముచే సుగంధ భరితము చేయుచు, కైవారము చేయుచుండు" నన్నారు.

ధూపము వేయుట 'కైంకర్య' మగునుగాని, కైవారము = (పొగడిక) కాదు.

## 3. 'పొగపు'

శాస్త్రిగారు, "వండిన చోష్యము బొగవు వాసనయుం బొగపాలు చందమున్" (2.113) అను తమ పాఠమును పేర్కొని, పీఠిక (పు.౧౧౬) లో,— 'పొగయు, వాసనయుఁ బొగపాలు చందముఁ' అని వెనుకటి పాఠమనియు, అందు 'పొగ' — 'పొగబాలు' అని యుండుటచేత పునరుక్తి యనియు, అందువలన తాము 'పొగపు' అని సవరించినట్లును వ్రాసినారు.

కాని వారియొద్దనున్న క్రొత్తపల్లివారి ప్రతిలో "పాగషువాసనయుక్" అను పాఠమే యున్నది. వారు చూచుకపోవుట పొరపాటు. ఒక గ్రంథమును పరిష్కరింప బూనుకొన్నప్పుడు, అప్పుడు ప్రచారములోనున్న అన్ని ముద్రణములనూ - అందలి పాఠములనూ చక్కగా అరసి - ఒరసి సాధు పాఠనిర్ణయము చేయవలెను. లేనిచో ఆ పరిష్కరణము నిర్దుష్టము కాదు.

శాస్త్రిగారు, తాము చూపిన పాఠమే ప్రతిలోనిదో, ఆ ప్రతి యెవరిదో, ఎప్పుడచ్చైనదో తెలుపలేదు. అట్లు తెలుపకుండుట లోపము. వారిట్లే పలుతావులలో "ఇది పూర్వముద్రిత పాఠము" అని వ్రాసియున్నారు. ఆ ముద్రణమేదో తాము తెల్పినగదా ఇతరులు పరిశీలించుటకు ?

ఇక్కడ ఒక్కమాట - భీమఖండమునకు క్రొత్తపల్లివారిది తప్ప మరియొక ముద్రిత ప్రతియున్నట్లు నాకు తెలియదు. నా మాటట్లుండగా, బహుగ్రంథ పరిశోధకులైన శ్రీ నిడదవోలు వేంకటరావు పంతులుగారు, 'భాషా పరిశోధన' యను వ్యాసములో —
"భీమఖండము తొలుత క్రీ. శ. 1901లో నాగంప ముద్రాక్షరశాలయందు 'జ్ఞాన ప్రసూనాంబికా గ్రంథమాల' యందు ద్వితీయ పుష్పముగ కీ. శే. క్రొత్తపల్లి పద్మనాభ శాస్త్రులవారిచే వెలువరింపబడినది. నాటికిని నేటికిని ముద్రిత ప్రతి యదియొక్కటియే."

అని వ్రాసియున్నారు కాబట్టి పాపయ్యశాస్త్రియొద్ద, క్రొత్తపల్లి వారిదికాక-మరియొక ముద్రిత ప్రతి యున్నచో, అది గొప్ప విశేషమగును. ఆ ప్రతిని గూర్చిన వివరములు వారెప్పుడైనను లోకమునకు వెల్లడించుట మంచిది.

## 4. 'విపులశాఖ'

"పిప్పుల శాఖా శిఖా మంత్ర వితతి నీసుడు
సంస్తుతించెను నందికేశ్వరుని ప్రీతి" (5. 8)

అని, పూ. పా.-శాస్త్రిగారును 'పిప్పల శాఖా' అనియే అన్నారు. ఈ పాఠ మర్థరహితము. 'వేదశాఖా' అనియుండుట యుచితము. సంస్తుతించుట వేదశాఖా మంత్రములతో గాని, 'పిప్పల శాఖా మంత్రము'లతో కాదు.

"మంచుంగొండ యనుంగుఁ బెండ్లికొడుకున్ వర్ణించు రేకాగ్రతన్
బంచవేద పురాణ మంత్రముల" (4. 104)

## '5. వారాసి దిక్కు'

"వనజాతాప్తుని మండలంబు దిగియెన్ వారాసి
దిక్సీమకున్" (2. 23)

అని, రెండు ప్రతులలోను పాఠము. 'వారాసిదిక్' అనుట తప్పు.

'రాసి' తెనుగు పదము. వార్ శబ్దముతో సమసింపదు. కావున 'వారాసి' యను సమాసము దుష్టము. 'వారాశి' యని సవరించినచో సమాసము చక్కబడి, వారాశిదిక్ = సముద్రపు దిక్కు - అని యర్థమగును గాని, ఆ యర్థము సందర్భోచితము కాదు.

ఎందుకు విస్తరము: పాఠము 'వారాజ దిక్సీమకున్' అని యుండ దగును. వారాజు - అనగా, (జలమునకధిపతి) వరుణుడు. కనుక, వారాజ దిక్సీమకున్ = వరుణుని దిక్కునకు - అనగా, పడమటికి, వనజాతాప్తుని మండ లంబు దిగియెన్ - అని యర్థమగును.

## 6. 'మాతృకంబులు'

"పలేటి మేటి కాలువల వలన నదీ మాతృకంబులగు
పంటవలంతి" (2. 55)

అని, రెండు ప్రతులలోను, పా.—

'పంటవలంతి' యేకవచనము. దాని విశేషణము 'నదీ మాతృ కంబు' లని బహువచనమున నుండుట తప్పు. వచన భేదమను దోషము.

పంటవలంతి - యనగా, భూమి. స్త్రీ; కావున 'నదీ మాతృకము అనుట లింగభేదమను దోషమగును.

కాబట్టి, 'నదీ మాతృకయగు పంటవలంతి' యని యుండదగును.

## 7. 'కలధౌతశకల'

'పంటవలంతి సలిలధౌత కలధౌత శలాకా శకల సంకోచం
కరణంబులు' (2. 55)

అని, పూ. పా.— "కలధౌతశకల" అని, శా. పా.—
శా. పా. లో 'శలాకా' పదము లోపించినది.

## 8. 'భానుజధార'

"భానుజవైరి మండపము భవ్యమునీంద్రులు
గాంచిరయ్యెడన్" (3. 180)

అని, పూ. పా.— భానుజ=సూర్యపుత్రుడైన-యమునకు, వైరి=విరోధియైన-శివునియొక్క, మండపము-అనియర్థము.
"భానుజధార మండపము" అని, శా. పా.—
"భానుజధార" యనగా అర్థమేమో! అసలీ పాఠమెక్కడిదో!

## 9. 'మహోత్సవ'

"క్రీడ సల్పును వాని సత్కీర్తికాంత
సప్తలోక మహోత్సవ సౌధవీథి" (1. 72)

అని, రెండు ప్రతులలోను, పా.— 'మహోత్సవ సౌధవీథి' యనుట అర్థరహితము. "మహోత్సంగ సౌధవీథి" యనియుండుట యుచితము. శ్రీనాథుడు "ఉత్సంగ" శబ్దము నుపయోగించు తీరును ఈ క్రింది రచనలు తెల్పుచున్నవి.—

"సప్తగోదావరోత్సంగ స్థలమునకు" (3. 158)
"సప్తగోదావరోత్సంగ జయమహేశ" (3. 191)

## 10. 'ఘనచక్రవర్తి'

"ఘనచక్రవర్తి యిచ్చిన ప్రవాళంబుల
యొడ్డాణము ధరించునొక్కవేళ" (1. 117)

అని, ఉభయప్రతులలోను, పా.—

చక్రవర్తులలో 'ఘను' డనువాడున్నాడో, లేడో నాకు తెలియదు గాని, "శిబి చక్రవర్తి యిచ్చిన" అను పాఠమొకటి యున్నట్లు తెలిసినది. చక్రవర్తులలో 'శిబి' యున్నాడు గావున ఆ పాఠమే గ్రహింపదగినది.

## 11. 'లటదిశా'

"తిమి తిమింగిల చక్ర విక్రమ విహార
ఘనమ ఘనమారంభ గంభీరఘోష ఘటిత
లటదిశా ప్రతి శబ్దోపలబ్ధి యుద్ధి" (3. 51)

అని, రెండు ప్రతులలోను-పాఠము. 'లటదిశా' అనన్నర్థమేమో తెలియ లేదు. 'లహరికా' యైయుండవలెనేమో !

## 12. 'ఆహూత'

"జనమేజయోద్ధ సర్పాధ్వరాహూత
చతురస్ర వస్సహస్రములఁబోలి,...
ఆడుచున్నవి పెంద్రిమ్మి యంబరమున,...
వేన వేలు పయోరాశి వీచిఘటలు" (3. 52)

అని, పూ. పా.— 'అధ్వరాహూత' అని, శా. పా.—

ఆకాశమున నాడుచున్న అలలను. జనమేజయుడు ఆరంభించిన సర్ప యాగమునకు, ఆహూత = పిలువబడి — వచ్చుచున్న—పాములతో పోల్చుట యుచితముగాని, అధ్వరమున, అపహూత = వెళ్లగొట్టబడి—పారిపోవుచున్న—పాములతో పోల్చుట యుచితముగాదు. అధ్వరారంభముననే 'అపహూతము' లైన వనుటయు ననుచితమే.

కాబట్టి, 'ఆహూత' అను పూర్వపాఠమే సమంజసము.

## 13. 'కటాక్ష దీక్షా'

"వేశ్యా కటాక్ష దీక్షా
వశ్య విలాసోపహాసిత వాసవతనయా" (4.212) రెండు ప్రతులలోను పాఠమిదే.- "కటాక్ష దీక్షా" అనుటకంటెను, 'కటాక్ష వీక్షా' అనుట సమంజసము; సహజ మార్గము. "దీక్షా" అను పాఠమున అన్వయ మెట్లో ?

## 14. 'భువన విజయము'

" [illegible] ... [illegible] లింగము,...
భువన విజయము [illegible] " (5 50)

అని, పూ. – పా. శాస్త్రిగారు "బీజంబు" అను పాఠము నడుగున చూపి, పద్యములో, "భువన విజయంబు" అన్నారు.

భువన బీజము – దివ్యసిద్ధలింగమునకు విశేషణము. ప్రపంచ సృష్టికి మూలమని యర్థము. "భువన విజయంబు" అనుట అనన్వితము.

కాబట్టి, పూర్వపాఠమే గ్రాహ్యము.

## 15. "శుద్ధార్థ"

రెండు ప్రతులలోను:– 'శుద్ధార్థ మాసవృద్ధి' (3.57)
అనియే యున్నది. పల్లావ పంటయొక్క అతిశయ-మని, ప్రకరణార్థము.
శబ్దము 'సిద్ధార్థము' గాని, 'శుద్ధార్థము' కాదు.
"సిద్ధార్థ స్తు పుమాన్ శాక్యసింహే చ సిత సర్షపే" (విశ్వ)

"వెనుక ముందట సమ్మర్దమునఁ గరంబు
దండసిలి మధ్యమునసున్న ధరిత్రీపతుఁడు
యంత్ర సిద్ధార్థ భావంబు నొల్లుకొనియుఁ
దనుఁ నసిద్ధార్థుఁగా నాత్మఁ దలఁచుచుండు" (శృం. నై. 4.125)

## 16. "వీరభద్రేశ్వరా!"

J.164
18-11-81

రెండు ప్రతులలోను, –

"వేమనక్షోణి భృద్వీరభద్రేశ్వరా!
స్వామికార్యాభిరక్షా క్రియా దక్షిణా!" (2.164)

అని రెండు సంబోధనలుగా పాఠమున్నది.

కృతిపతియైన అన్నయమంత్రిని "వీరభద్రేశ్వరా!" అని పిల్చుటే అసంగతము. వేమనను గూడ జోడించి. "వేమన వీరభద్రేశ్వరా!" అని పిల్చుట కేవల మసంగతము,

అసలది సంబోధనము కాదు. 'రా' అని దీర్ఘముగా ముద్రించుట తప్పు. "వేమన...వీరభద్రేశ్వరస్వామి కార్య..." అని రచన. పద్యమున ఆ రెండు పాదములును ఒకటే సమాసము. "వేమనరెడ్డి. వీరభద్రారెడ్డి-యను, స్వామి=ప్రభువులయొక్క, కార్య-వ్యవహారములను, అభి ... దక్షిణా = చక్కబెట్టుటయందు సమర్థుడా!" అని అన్నయ మంత్రికి సంబోధనము. కాబట్టి 'వీరభద్రేశ్వరా' అనుపాఠము తప్పు.

## 17. 'శాటికాకటు'

"ఆశాతటీ పటలీ శాటికాకటు
వటుకభైరవు నిష్టవరదుఁ జూచి" (3. 184)

అని, పూ. పా.—

"ఆశాతటీ పటీవ్యాటీకితకవేళి"

అని, శా. పా.—

ఈ పాఠమున నర్థమేమో నాకు తెలియలేదు. వారు "పటలీశాటికాకటు" అనుపాఠమును క్రిందవుంచి, పైన తమపాఠమును చేర్చినారు. ఇంత పెద్ద మార్పు చేయుటకంటెను, పూర్వపాఠములోని 'కటు' ను, 'కటి' గా మార్చుట యుచితము.

అప్పుడు,— ఆశాతట పటలియే శాటిగాగల కటి గలవాడు—అని సుఖముగా అర్థమగును. ('దిగంబరు' డని దాని భావము) ఈ యర్థము తోనే శ్రీనాథుడు. "ప్రిడాశూన్యకట" యనియు ననియున్నాడు.

"పలాపిలోకింప ప్రిశాకశాశూన్య
కటిఁ గాలిభైరవు పటుకనాథు" (2. 105)

## 18. 'వాంఛిత'

"దక్షారామ వధూటీ
వక్షోరుహ మృగమదాది వాంఛిత విలస
ద్వక్షః కవాట !" (3. 221)

అని, ఉభయప్రతులలోను పాఠము —

మృగమదాదులచేత 'వాసిత' మగుట సహజముగాని, 'వాంఛిత' మగుట సహజముగాదు. వాంఛించుటకు కస్తూరి మొదలగు వస్తువులు చేతనములుకావు. కావున 'వాంఛిత' పాఠము సాధువుకాదు. మృగమదాది 'వాసిత', అని మార్చుట యుచితము.

'వాసన,— మనగా, వాసనకట్టుట (= సువాసన పట్టించుట).

## 19. 'నీహార' – 'అగ్రవరుని'

"అఖల నీవార ముష్టింప చాగ్రవరుని" (2. 83)

అని, పూ. పా.— "నీహార ముష్టింప చాగ్రవరుని". అని, శా. పా.—

మునులు 'నీవార ముష్టింపచులు' (= నివ్వరిధాన్యముతో జీవించువారు) గాని, 'నీహార ముష్టింపచులు' (= మంచుతిని బ్రతుకువారు) కారు.

శ్రీనాథుడు, కాశీఖండములో,-

"అఖిల నీవార ముష్టింపచాగ్రగణ్య" (6. 277)

అని, యనియున్నాడు. అర్థమొకటే. "నీహార" పాఠము తప్పు. "అగ్రవరుని" యనునది, ఉభయ ప్రతులలోనుగల తప్పు. అది యర్థము లేని మాట. "అగ్రసరుని" అని యుండవలెను.

అగ్రసరుడు (= అగ్రేసరుడు) = శ్రేష్ఠుడు.

"పార్థివ, ప్రాగ్రసరుండు ధర్మసుతు డస్విది.' (భా. అర. 5. 416)

## 20. 'విశ్రాంత'

"దివోదాసు బాహా విశ్రాంత బలంబుచేత" (2. 98)

అని, రెండు ప్రతులలోను పాఠము.

"బాహావిశ్రాంత బల" మనగా, బాహువులయందు విశ్రమించిన బలము. విశ్రమించిన బలము ప్రయోజనకారి కాదు. కావున ఆ యర్థము సరిపడదు.

బాహావిశ్రాంతి బలంబుచేత — అని యుండవచ్చును. అప్పుడు బాహు పరాక్రమ బలముచేత — అని యర్థమగును. ఆ యర్థము సరిపడును, కావున 'విశ్రాంత' పాఠము విచార్యము.

## 21. 'భక్తిః'

"మా భూ త్త్రిపూరుషీ భక్తిః" (2. 109)

అని, పూ. పా.— "భక్తిః" అనుటతప్పు. ఈ తప్పు శాస్త్రిగారి ప్రతిలోను ఉన్నది. "ముక్తిః" అని యుండవలెను.

"మూఁడు తరములఁ జెడుఁగాక ముక్తిలక్ష్మి" (కాశీ. 7. 158)

అని శ్రీనాథుని యనువాదము.

ఇవి సంస్కృతభాషకు సంబంధించిన పాఠదోషములు. ఇట్టి వింకను, ఎన్నో యున్నవి. ఇది దిక్ప్రదర్శన మాత్రమే. ఇక ఆంధ్రభాషకు సంబంధించిన దోషములు కొన్ని తెల్పెదను.

## 22. ' వేఁ బో క '

" పూఁబోణులకును విటులకు
వేఁబోకలఁ దలరు సొంపు వీడ్కొలుపుఁ బురిన్
వేఁబోకఁ బోఁక తోఁటల
పూఁజాళల కమ్మతావిఁ బొడలిన గాడ్పుల్ " (1. 98)

అని, రెండు ప్రతులలోను పాఠము.- పద్యమున, మూడవపాదములో నుండవలసినది. ' లేఁబోక ' గాని, ' వేఁబోక ' కాదు. శ. ర. కర్త, ' పూఁబోఁడి ' అను పదముక్రింద,-

" లేఁబోకఁ బోఁక తోఁటల "

అను పాఠమునిచ్చి, 'లేఁబోక' యను పదమునకు, "(లేత + పోక) మందగమనము" అని యర్థమున్నూ చెప్పియున్నాడు. కాబట్టి 'వేఁబోక'- పాఠము తప్పు.

అది యట్లుండగా, పై పాఠములో పద్యార్థమును పాడుచేయుచున్న యింకొక పెద్ద తప్పు- పరిష్కర్తల కంటబడక- దాగియున్నది. అది 'సొంపు' అను పదము.

వెనుకటి యచ్చులోను, శాస్త్రిగారి ముద్రణమునను, సూ.ని.లో 'తలరు' క్రింద నున్న పద్యములోను,- " వేఁ బోకలఁ దలరు సొంపు వీడ్కొలుపు " ననియే పాఠము. ఆ పాఠము ప్రకారము,- పూఁ బోణులకును విటులకును, వేఁ బోకల యందు, సొంపు=సొగసు, తలరు=అతిశయించు- ననియు, ఆ సొంపును, కమ్మతావింబొదలిన గాడ్పులు పోగొట్టు- ననియు నర్థము.

శృంగార నాయికా నాయకులకు వేకువలయందు 'సొంపు' అతిశయించు ననుటయు, ఆ సొంపును-కమ్మని మెల్లని గాలులు పోగొట్టుననుటయు స్వభావ విరుద్ధాలాపమగును. అట్టి రచన మహాకవి శ్రీనాథుఁ డెన్నటికిని చేయడు.

విటీ విటులకు వేఁ బోకలం దతిశయించునది 'సొలపు'గాని, 'సొంపు' కాదు. సొలపు- అనగా రతిశ్రమ. ఆ శ్రమను ప్రభాత వాయువులు పోగొట్టునని శ్రీనాథుని రచన. లోకానుభవమున కనుగుణము.- 'సొలపు' లోని 'ల', వ్రాతలోనో- అచ్చులోనో సున్నగా మారి, సొలపు- 'సొంపు' అయినది. ఆ మార్పును గమనించిన వారు లేనందున ఆ 'సొంపు' అట్లే పద్యమున పాతుకొని, అర్థమును వ్యర్థము చేయుచున్నది.

పురవర్ణన సందర్భమున ప్రత్యూష వాయువులు రతిశ్రమను పోగొట్టునని చెప్పుట కవుల కదియొక ఆచారము. ఆ యాచారము కాళిదాసు నాటినుండియును గలదు.

"ప్రత్యూషేషు స్ఫుటిత కమలా మోద మైత్రీ కషాయః
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మంగాను కూలః
శిప్రా వాతః" (మేఘ. 1.32)

ఈ శ్లోకము విశాలా నగర వర్ణనము లోనిది. చల్లని శిప్రానదీ వాయువు ప్రభాత కాలములయందు, ఆ నగరములోని స్త్రీల సురతాయాసము నడగించు చుండునని వర్ణన.

తెల తెలవాఱ నొయ్య నరుదెంచి నిశాంత రతాంత తాంత లౌ
చెలువల కింపుగా మెలఁగి......వాడిన సెజ్జల మీఁది ప్రావిరుల్
దొలఁగఁ బ్రభాత వాయువులు ద్రోచుఁ బురిం బరిచారికా కృతిన్
(పాండు. ౧.౧౧౯)

ఈ పద్యము వారాణాసీ వర్ణనము లోనిది. ఇందు, తెల్లవారుఁవేళ వీచు వాయువులు సురతశ్రాంతలైన కాంతలకు పరిచర్యలు చేయుచుండునని చెప్పబడినది.

శ్రీనాథుని రచనయు నిట్టి భావముతో ప్రవృత్త మైనదే. అందలి కమ్మగాడ్పులును రతి శ్రమను పోగొట్టునవే. 'సొంపు'ను పోగొట్టునవి కావు. కాబట్టి "సొంపు వీడ్కొలుపు" అను పాఠము, 'సొలపు వీడ్కొలుపు' అని మార్పబడ వలెనని నా యభిప్రాయము.

## 23. 'బవిసి మాలి'

"ప్రతి గృహంబును బరిభ్రమించి విసికి విసిమాలి వేసరి" (2.101) అని, పూ. పా.- "విసికి బవిసిమాలి వేసరి" అని, శా. పా.-

క్రియ 'విసుగు' (=విసువు) గాని, 'విసుకు' కాదు. కనుక, "విసికి" అను పాఠము రెండు ప్రతులలోను తప్పు. 'విసివి' అని యుండవలెను.

బవిసి మాలుట- యనగా సిగ్గు మాలుట. ఆ యర్థము ప్రకరణానుచితము. 'విసిమాలి' యను పూర్వ పాఠమే సరియైనది.

"దోఁచు" అని ముద్రిత ప్రతి పాఠము. సరికాదు.

"విసివి విసిమాలి వేసిరి"—అను రచనలో గల అక్షర రమ్యత నరయ గలిగిన వారికి 'బవిసి మాలి' యను పద మా వరుసలో చేరదగినది కాదని— ఒకరు చెప్పనక్కరలేదు. అర్థమును బట్టియు, ఆకారమును బట్టియు ఆ పద మందుండ దగినది కానే కాదు.

ఇంత చర్చ యెందుకు? శ.ర.లో 'జూకించు' అను పదము క్రింద "విసిమాలి" అను పాఠమే యున్నది. కాబట్టి పూర్వ పాఠమే సరియైనది.

## 24. 'ఉబుచుకొను'

"ఒండొరుల తోడు తను చెప్పుకొండు రుబుసు" (4.33) అని, పూ. పా.- శాస్త్రిగారు "తోడుతఁ జెప్పుకొందు రుబుసు" అను పాఠ మొకటి అడుగున జూపి, పద్యములో,—

"ఒండొరుల తోడఁ జెప్పుకొం డ్రుబుజు కొనుచు" అను పాఠమును చేర్చినారు.

శబ్దము 'ఉబుసు' గాని 'ఉబుచు' కాదు. ఉబుసుకు రూపాంతరము- 'ఊసు'.

"ఆంధ్రభుమా, స్థలికిం బోదమె యూసుపోకను" (5.15) ఉబుసు పుచ్చు; ఉసుసుపోవు-అనియేగాని, ఉబుచుకొను' అను క్రియ లేదు. శాస్త్రిగారు చూపిన ప్రాత పాఠమూ, వారు సంపాదించిన క్రొత్త పాఠము కూడా సరియైనవి కావు. పూర్వ పాఠమే సరియైనది. ఉబుసు చెప్పుకొనుట- యనగా, ప్రొద్దు పోకకు ముచ్చట చెప్పుకొనుట.- "ఇంచుక ప్రొద్దు పోకడకు నెవ్వరితో నుబు సేమి చెప్పుదుము" (విక్ర. 6.38) కొందును; కొందురు- అనుటకు, 'కొండును'- 'కొండురు' అనుట ప్రాచీన సంప్రదాయము.

"ఎండకు వాన కోర్చి తన యిల్లు ప్రవాసపుఁ బోటు నాక యూఁ
కొండు నలంగుదుఁగా" (విరాట. 1.135)

"చూచి, కొండ మెల్ల ననియు రండు వేగ" (మౌసల. 1.173)

## 25. 'మ్రొక్కి యంజలి యొత్తె'

"మ్రొక్కి యంజలి యొత్తె న మ్ముదుకపణఁతి" (5.91) అని, రెండు ప్రతులలోను పాఠము.—

అంజలి యెత్తుట- యనగా, అంజలి చేయుట. అంజలి చేసి మ్రొక్కు గాని, మ్రొక్కిన తరువాత అంజలి చేయరు. కనుక, పాఠము,—

'మ్రొక్కి నంజలి యెత్తి'

అని యుండనగును.

## 26. "కట్టెఁ బట్టంబు"

"కట్టెఁ బట్టంబు యువరాజు గజముఖునకు" (5.91) అని, రెండు ప్రతులలోను పాఠము.- దానిని బట్టి, 'యువరాజు (ఎవడో), గజముఖునకు పట్టము గట్టె'నని యర్థమగును. ఆ యర్థము సందర్భోచితము కాదు.- '(ఈశ్వరుడు) గజముఖునకు యువరాజ పట్టము గట్టెను'- అని, అక్కడ కావలసిన యర్థము. కాబట్టి, పాఠమును,—

'కట్టె యువరాజ పట్టంబు గజముఖునకు'

అని మార్చుట యుచితము.

"ఉండు డుంఠి వినాయకుం డెందు నొసలిపై
యువరాజ పట్టంబు నవధరించి" (కాశీ. 7.147)

## 27. "సంబరులు"

"కుంభ పులిన సంభవులు సంబవులు దొడిగికొని" (3.57) అని, పూ. పా.— శాస్త్రిగారు "సంబవులం" అను పాఠ మొకటి యడుగున జూపి,—

"కుంభ సంభవ పులిన సంభవులు సంబరులం దొడిగికొని"

అను పాఠమును పైన చేర్చినారు.

సంబవు— లనగా పావుకోళ్లు. 'సంబరు' లన్నను అదే యర్థమేమో గాని, ఆ పదము శ.ర.లో లేదు. "సంబరి = ఎలుక జీడి చెట్టు" అని మాత్రమే యున్నది. ఆ యర్థము సరిపడదు గదా!

అది యట్లుండగా, "సంభవులు — సంబవులు" అని శబ్దాలంకారము. 'సంబరులు' అను పాఠమున అలంకారము చెడుచున్నది. మరియు, శ.ర. కర్త, "సంబవులు = పావుకోళ్లు" అని యర్థము చెప్పి, అందు కీ వచనమునే ప్రమాణముగా చూపి యున్నాడు. అట్టి పాఠమును మార్చుట సంప్రదాయ విరుద్ధము. 'సంబవులు' అను పూర్వ పాఠమే ఉండదగినది.

ఇక్కడ ఒక్కమాట.—

"కుంభ పులిన సంభవులు" అని, పూ. పా.—

"కుంభ భవ పులిన సంభవులు" అని, శ. ర. పా.—

"కుంభ సంభవ పులిన సంభవులు" అని, శా. పా.—

ఈ మూడింటిలో కవి పాఠ మేదో ఒకటి యగునే గాని మూడును కావు గదా! వచనము గనుక వ్రాయసగాండ్లు, వారి వారి రుచికి తగినట్లు మాటలను పెంచిన ట్లున్నది. "కుంభ పులిన సంభవు" లనుటలోనే బిగువును, రుచియు కలవనియు, శ్రీనాథునిరచన అదియే అయ్యుండు ననియు నా యభిప్రాయము.

## 28. "కొ మ రు సా మి"

"కొక్కొ్కరోకో యని కొమరసామి రథంబు" (2. 28)

అని, పూ. పా.— "కొమరుసామి" అని, శా. పా.—

కుమారస్వామి శబ్దభవము 'కొమరసామి' యేగాని, 'కొమరుసామి' కాదు. (చూ. శ. ర.)

## 29. "వ ర టు"

"సంతతంబును గృచ్ఛ చాంద్రాయణాదుల
వరటుచునుంట యెవ్వరికి మెచ్చు" (4. 32)

అని, పూ. పా.— శాస్త్రిగారు "వనరుచు" అను పాఠమొకటి చూపి, తాము "వనటుచునుంట" అన్నారు.

'వనరుట' యనగా, దుఃఖించుట. చాంద్రాయణాది వ్రతములాచరించువారు దుఃఖింపరు. కావున ఆ పాఠము సరికాదు.

'వనటు' అను క్రియయే లేదు. కాబట్టి శాస్త్రిగారి పాఠమును తప్పే. పూర్వపాఠమే సరియైనది. 'వరటుచునుంట = కృశించుచుండుట' అని యర్థము. (వరటు – శ. ర. లో లేదు,

వ్రతాచరణమున శరీరము కృశించును.—

"కుశలత యే వ్రతముల నగు
నశనాయాసమున నింద్రియము నిరోధమునన్
గృశుఁడవయి, యాత్మ నలఁచుట" (మను. 2. ఆ.)

## 30. " వ్రేల్చు "

" తెగువ దక్షుని కంఠంబుఁ ద్రెవ్వవేసి
వ్రేల్చెఁ దల నధ్వరాగ్నిని వీరభద్రుఁ, డు " (6. 59)

అని, రెండు ప్రతులలోను పాఠము. " వ్రేల్చు " ననుట తప్పు. వ్రేల్చుట-యనగా - వ్రేలాడజేయుట. తలను, అధ్వరాగ్నియందు వ్రేలాడజేసె ననుట యసంగతము.

కాబట్టి, పాఠము ' వేల్చె ' నని యుండ వలయును. తలను, అధ్వరాగ్ని యందు, వేల్చెన్ = ఆహుతిచేసెను. అని యర్థమగును.

' వేల్చు ' నుండి పుట్టినవి, వేలిమి: వేలిమిగిట్ట; వేలిమిబొట్టు; వేలిమి యరుగు — మొదలయినవి.

## 31. ' ఒడ్డగిల్లె '

" దొడ్డనయమున వెలుఁగులు నొడ్డగిల్లెఁ
దెలుపి చంద్రాతపము నేల చలచి కాయ
వంత సురపిల్లి యిప్పుడు నాసి పాసి
గంధవతి పట్టి యెలఁగొంగఁ గన్ను మోడ్చె " (2. 46)

రెండు ప్రతులలోను నిదేపాఠము. ఈ ప్రతులలోనే కాదు, సూ. ని. తో, ' చలచు ' అను పదము క్రియగా, పాఠము పట్టియున్నది. (ఆ నిఘంటువు " చలచు = ఆక్రమించు " అని యర్థము చెప్పినది).

కాని, యీ పాఠమున సమన్వయము యర్థము చెప్పుటలేదు:-

' నేల = భూమి, చంద్రాతపమును చలచి కాయగా — శీతాంశు దొడ్డ గిల్లెను; గంధవతిపట్టి కన్నుమోడ్చెను '- అని యర్థమగుచున్నది.- నేల వెన్నెలకాసిన దనుటయు, దానిచేత చంద్రుడు నొడ్డగిల్లినా డనుటయు — పొందికలేనిమాటలు. ఈ వికృతార్థస్ఫురణకు కారణము పాఠములో నున్న తప్పులు.

" ఒడ్డగిల్లె " నను క్రియను, ' ఒడ్డగిల్లి ' యనియు, " నేలచలచి "ని ' నేలఁజలచి ' యనియు సవరించినచో పాఠము చక్కబడును.

అప్పుడు,- శీతాంశుదొడ్డగిల్లి, చలచిచంద్రాతపము = ముదురువెన్నెలను, నేలన్ = భూమియందు, చలచి కాయన్ = పూనికతో (దట్టముగా)

ప్రసరింపజేయగా, (ఆ వెన్నెట) గంధవతిపట్టి కన్నుమోడ్చెను - అని యర్థమగును.

కాబట్టి, 'ఒడ్డగిల్లె' — 'నేలచఱచి'- అను పాఠము తప్పు. సూ. ని., 'ఒడ్డగిల్లు' క్రింద, "శీతాంశుఁడొడ్డగిల్లె" అను పాఠమునే చూపినది, పొరపాటు.

(సశేషము)

కవిత:

# విరహ జ్యోతి

—శ్రీ బి. వి. సింగరాచా

కాంతి కాంతి కాంతి అహో!
విరహజ్వాలిక రగిల్చి
విరచింపుము విమల కాంతి!

ఈ దీపిక కాంతిహీన
మిదె విధాత వ్రాతయౌనా!
మృత్యువు మే లింతకన్న
నెల్ల భంగుల!

"భగవానుడు నీకొరకై
పలవించుచు నెదురుసూచు
నీ ఘనాంధకార రాత్రి
నీ యభిసరణము గోరుచు
వెతల రాచి వన్నె వాసి
వృద్ధిసేయు నీకు స్వామి"

యనుచు వేదనా దూతిక
యాలపించు విరతిలేక

ఆకసమున ముసరె మొయిళు
వేరధార గురియుచుండె
ఈ ఘోరాంధ నిశీధిని
నెవరి కొరకొ నా ప్రాణము
ఎద నెద నులికులికి పడుచు
నెదురు సూచు నహో బాట!

ఆకసమున ముసరె మొయిలు
లేకధార గురియుచుండె
ఈ మెరపొక త్రుటి వెలింగి
యిరుల చిక్కబరచి పోయె
ఈ విభావరీ గభీర
మృదు సునాద మే సుమార
తీర సీమ ప్రభవించెనో !-
ఊరక నా ప్రాణము నా
తీరము వెస కాక్రషించు
తిమిర భయంకరత పెంచు.

కాంతి కాంతి కాంతి అహో !
విరహజ్వాలిక రగిల్చి
విరచింపుము విమలకాంతి

ఉరుము సాగె మేఘపాళి
ఊళవెట్టుచుండె గాలి
కారు రాయి బోలు రేయి
గడచిన మరి కూడి రాను
ప్రేమ దీప మిక నైనను
విరచింపుము స్నేహధార

కాంతి కాంతి కాంతి అహో !
విరచింపుము విమల కాంతి.

(రవీంద్రుని గీతాంజలి నుండి)



శ్రవ్య నాటిక :

# లలిత

[ప్రసిద్ధ ఫ్రెంచి నవలా రచయిత బాల్జాక్ నవల "యూజీన్ గ్రాండే" (Eugene Grandet) ఆధారంగా వ్రాయబడ్డ నాటిక.]

—శ్రీ డి. రామలింగం.

## పాత్రలు

లలిత : లింగరాజుగారి కూతురు.

ధనలక్ష్మమ్మ : లింగరాజుగారి భార్య.

లక్ష్మి : లింగరాజుగారింట్లో పనిమనిషి.

లింగరాజు : పెద్ద ధనికుడు, పరమలోభి.

రంగనాథం : లింగరాజుగారి స్నేహితుడు.

రాజారావు : లింగరాజుగారి మేనల్లుడు.

శేఖరం : రంగనాథంగారి కొడుకు.

ఆనందస్వామి: లింగరాజుగారి కుటుంబ స్నేహితుడు.

* * * *

లింగరాజు : ఒకటి, రెండు, మూడు, నాలుగు. అయిదు.-అయిదు రత్నాలు అమ్మాయ్! అమ్మాయ్ రత్నం!

లలిత : (లోపలినుంచి) వస్తున్నా నాన్నా... ఏమిటి నాన్నా ఇవ్వాళ నా పేరే మార్చేశారు?

లింగ : ఇవాళే కాదు, ఎప్పుడో మార్చేను. కాని మీ అమ్మ వింటేనా? నాన్నమ్మ పేరని చెప్పి లలితని పెట్టింది.

లలిత : ఆ పేరే బాగుంది నాన్నా.

లింగ : ఉహుఁ, రత్నం బాగోలేదేం? రత్నమంటే ఎంత విలువైన వస్తువ. ఈ రోజుల్లో నీటుగా తిరిగే పెద్దమనుషుల్లో ఒక్కడైనా రత్నం మొహం చూచాడా? అమ్మాయ్, ఇవాళనుంచీ నీ పేరు రత్నం అని మార్చాల్సిందే.

లలిత : ఎందుకు నాన్నా?

లింగ : (రహస్యం చెబుతున్నట్టు) ఇవాళ రత్నాలు తెచ్చానమ్మా మనింట్లో నోట్ల కట్టలున్నాయి- వెండి వుంది. బంగారం వుంది.

ముత్యాలున్నాయి. ఖరీదైన రత్నాలున్నాయి. మరి రత్నాలుండొచ్చు. అందుచేత నేను ముద్దుగా నిన్ను రత్నం అని పిలుస్తానమ్మా.

లలిత : వొద్దు నాన్నా, నా పేరే నాకు బాగుంది.

లింగ : హుఁ. ఈ తరమంతా ఇంతే. సొమ్మంటే ఏదో హీనమైన వస్తువుగా చూస్తారు. పనికిమాలిన వాటినన్నిటినీ పొగుడుతూ వుంటారు. (అనునయంగా) చూడమ్మా, సొమ్మనేది చాలా గొప్ప వస్తువు. దాన్ని గౌరవించి పదిలం చేసుకోవాలి.

లలిత : నువ్విచ్చిన సొమ్ము నేనేమీ ఖర్చు చేయడం లేదు నాన్నా.

లింగ : అందుకే కదమ్మా నీ కిస్తా. కరహస్తం గతం గతం, అన్నారు. గుప్పిట్లో పెట్టుకుంటే గుట్టుగా వుంటుంది. సరేగాని ఇవాళేం రోజో చెప్పమ్మా.

లలిత : ఆదివారం నాన్నా.

లింగ : అది కాదమ్మా.

లలిత : ఏమిటి నాన్నా.

లింగ : ఈ మాత్రం జ్ఞాపకం లేకపోతే ఎలాగమ్మా. ఇవాళ నీ పుట్టిన రోజు కదూ.

లలిత : అవును నాన్నా.

లింగ : ఒసే. ఏమే. ధనం—హుఁ. అస్తమానం ఆ గదిలో నిర్జీవంగా కూలబడివుంటుంది. ఏమేవ్ ధనం ?

ధన : ఏమిటండీ ?

లింగ : ఓసి వెర్రిమొహమా, ఇవాళ అమ్మాయి పుట్టినరోజు పండగ. జ్ఞాపకం వుందా ?

ధన : ఈయేడు జరుపుతున్నారేమిటి ?

లింగ : అలా అనుకోవడమెందుకే ?

ధన : పోయినేడు జరపలేదు కాబట్టి.

లింగ : నీ వెర్రి మొహానికి అమాత్రమే అర్థమైంది. నిరుడు ఎందుకు జరపలేదో తెలుసా ? మనం పిలవ్వలసిన వాళ్ళంతా వ్యాపారాల్లో దెబ్బలు తిని కూర్చున్నారు. అలాంటి వాళ్ళు అమ్మాయికి బహుమతులేం తెస్తారే ?

ధన : మరి ఇప్పుడు తెస్తారా ?

లింగ : చూస్తావుగా, ఎవరికోసం తెస్తారు! పైగా, లక్షలు పిరాయిస్తూ వ్యాపారం చేస్తూవున్న ఈ లింగరాజుతో సంబంధమందుకోవాలని ఈ వూళ్ళో ఎంతమంది తహతహలాడుతున్నారో తెలుసా ?

ధన : నాకేం తెలుస్తుంది. మీకు ప్రతిదీ వ్యాపార రహస్యమేనయ్యె.

లింగ : చెప్పావులే. చూడూ, ఎంత లేదన్నా ఇవాళ ఐదారు వేలకిమ్మత్తు చేసే బహుమతులు రాలతాయి. ఇంట్లో ఒక్కటి చెయ్యక్కర్లేదు అన్నీ బొంబాయి మిఠాయి కొట్టువాడికి చెప్పిచ్చాను. పిలవ్వలసిన వాళ్ళని పిల్చాను. ఇల్లంతా చక్కగా అమర్చి పార్టీకి అన్నీ సిద్ధం చేయండి. లక్ష్మి ఎక్కడ ? లక్ష్మీ! లక్ష్మీ!

లక్ష్మి : (దూరంనుంచి) వస్తున్నా బాబయ్యా.

(మెట్లమీది వరిగి అది పట్టి చప్పుడు, కప్పులు పడ్డ శబ్దం)

లింగ : అయ్యొయ్యో, అయ్యొయ్యో. అట్లా పడ్డావేమే! ఆ కప్పులున్నాయా ? పోయ్యాయా?

లక్ష్మి : కాలు జారింది బాబయ్యా.

లింగ : నీ కాలు కేంలే. కప్పులెన్ని పగిలాయో అంట ?

ధన : పగిలకేం చేస్తాయి. పాతబడ్డ ఆ చెక్కమెట్లు తీసేయించి మెట్లు కట్టించండంటే వినిపించుకుంటేనా ?

లింగ : ఓసి వెర్రి మొహమా, వున్నదాన్నే పదిలంగా వాడుకోవాలే-ఇంటికి మరమ్మత్తంటూ మొదలు పెడితే ఎంతవరకు పోతుందో తెలుసా ?

ధన : పెత్తనం మీదైతే నాకేం తెలుస్తుంది ?

లింగ : నాది కాబట్టే ఈ లింగరాజు సంసారమంటే వూళ్లో ఒక లెక్కగా వుంది. ఆఁ, లక్ష్మి నిన్నెందుకు పిల్చానో తెలుసా ?

లక్ష్మి : చెప్పండి బాబయ్యా

లింగ : ఇవాళ లలిత పుట్టిన రోజు పండగకు పదిమంది పెద్ద లొస్తున్నారు. వాళ్ళకి చక్కని కాఫీ పెట్టు.

లక్ష్మి : అలాగే బాబయ్యా, కాఫీపొడి, చక్కెర, పాలూ ఇప్పించండి.

లింగ : నేను స్టోర్ రూమ్ కొచ్చి తాళం తీసి ఇస్తా పదా.

ధన : ఇదీ నా కాపరం.

లింగ : నీ కాపరానికేమే ? లక్షాధికారి కాపరం.

లలిత : పైకెళదాం పదన్నా.

లింగ : పైకెళ్ళి యేం చేస్తారు ? పిల్చినవాళ్లు వచ్చే వేళ అవుతూంది. గుమ్మంలో వుండండి.

( రాత్రి-ఎనిమిది గంటలు కొడతాయి )

రంగ : (తలుపుతట్టి) లింగరాజుగారూ ! లింగరాజుగారూ !

లింగ : ఆc, వస్తున్నా. వస్తున్నా... ఓ రంగనాథం గారు ! దయ చేయండి, దయచేయండి. సరిగ్గా వేళ కొచ్చారు,

రంగ : మీవంటి శ్రీమంతులు పిలిచాక రెక్కలు కట్టుకొని వాలొద్దండీ,

లింగ : ఆc, ఎంతమాట ! ఎంతమాట ఏదో పేదవాణ్ణి. అంతేసి మాటలతో నన్ను పెద్దవాణ్ణి చేస్తున్నారు.

రంగ : ఒళ్లు చేస్తే అన్నీ రావటయ్యా, అదృష్టం వుండాలి. సిరి వెదుక్కుంటూ రావాలి. ఆ వచ్చిందాన్ని సిద్ధింపజేసుకునే యోగ్యత వుండాలి.

లింగ : ఏదో మీవంటి ఆప్తుల దయ.

రంగ : సరే కాని వీధి తలుపు వేసి వుంచే ఇవాళ అమ్మాయి పుట్టినరోజు జరపడం లేదేమో అనుకున్నా.

లింగ : జరపడానికే కదండీ పెద్దల్నందర్నీ పిలవడం. (రహస్యంగా) చూడండీ ... రాత్రిళ్లు వీధి తలుపు తీసివుండడం మంచిది కాదు. రోజులు బాగా లేవు. సంపాదనలు లేక సంగ్రహించడానికి పూనుకొనే రోజులు, డబ్బున్నవాడి ఇల్లు చూస్తే ఈ కాలం అందరికీ కన్నెర్రే.

రంగ : మా బాగా చెప్పారు.

లింగ : లోపలికి పదండీ, ఆc. ఆc ! ఏమిటిదంతా పెద్ద సరంజామా తెచ్చారు. ఓరి నీ ఇల్లు బంగారంగానూ, ఎంత పని చేశావయ్యా.

రంగ : ఏదో నా తాహతు కొద్దీ బహుమతులండీ.

లింగ : సరే, సరే, పదండి లోపలికి...

రంగ : తలుపు మూసేస్తున్నారేమిటీ?

లింగ : ఏం?

రంగ : ఆనందస్వామి గారు కూడా వొస్తున్నారు.

లింగ : ఓహో స్వాములవారా. అదుగో మాటలోనే వచ్చేశారు. నమస్కారాలు స్వాములవారూ.

ఆనంద : ధన కనక వస్తు వాహనాభివృద్ధి రస్తు.

లింగ : ఎంత బాగా దీవిస్తారు.

రంగ : స్వాములవారి దీవనలు.

లింగ : లోపలికి దయచెయ్యండి.

ఆనంద : కొంచె మాగండి శేఖరం కూడా వస్తున్నాడు.

లింగ : ఎవరు? రంగనాథంగారి అబ్బాయా.

రంగ : అవునండీ, లలితంటే వాడికి చాలా అభిమానం.

ఆనంద : నిర్మలమైన ప్రేముంటే అలాగే వుండాలి.

(కారు హారన్ మ్రోగి ఆగిన చప్పుడు)

లింగ : ఓ, శేఖరం వొచ్చావా నాయనా!

శేఖ : అవునండి, లలిత పుట్టినరోజు కదూ.

లింగ : ఏమిటివన్నీ. అన్నీ లలితకే!

శేఖ : నా ప్రెజెంట్స్ లెండి.

లింగ : మరి లోపలికి పదండి. అమ్మాయ్ లలితా! ఏమేవ్ ధనం. ఓ లక్ష్మి. పెద్దలంతా వొచ్చేశారు. అన్నీ పెట్టేసెయ్యండి.

లక్ష్మి : అలాగే బాబయ్యా.

లింగ : లలితా. ఇలా రా అమ్మా.

లలిత : ఏం నాన్నా.

రంగ : ఇటొచ్చి శేఖరు పక్కన కూర్చో అమ్మా. ఇవి తీసుకో అమ్మా,

లింగ : అవునమ్మా నీకు బహుమతులు తెచ్చారు.

శేఖ : ఇవి నా ప్రెజెంట్స్.

లింగ : తీసుకో అమ్మా.

ఆనంద : ఈ మాత్న వస్త్రాలు తీసుకో అమ్మా. నీ కోసం బెనారసు నుంచి తెప్పించాను.

లింగ : స్వాములవారికి పాదాభివందనం చెయ్యమ్మా.

ఆనంద : చిరంజీవివై వర్ధిల్లమ్మా.

లింగ : ఇది నా బహుమతి తీసుకో అమ్మా. చూడండి, అమ్మాయి ప్రతి పుట్టినరోజు పండగకూ పన్నెండు కాసులు ఇస్తూ వుంటాను.

రంగ : చాలా విలువైన బహుమతి.

ఆనంద : బిడ్డల మీద వుండే ప్రేమ అన్నిటికీ అతీతమైంది.

రంగ : లేకపోతే లింగరాజుగారు బంగారం ఇస్తారా. ఆయన కెవ్వరి మీదా ప్రేమ లేదనీ, డబ్బు మీద నే ప్రేమనీ గిట్టనివాళ్లంటారు గాని అది అబద్ధ మనడానికి ఇది ప్రత్యక్ష దృష్టాంతం.

లింగ : లోకులు పలుగాకులండీ. అయినా ధనమూల మిదం జగత్ అన్నారు. గుణం లేని వారు పోకి చెయ్యడం. వాళ్ల మాటల కేమి గాని ఇక మీరు పదార్థాలు స్వీకరించండి.

రంగ : అలాగే. మీరు మొదలు పెట్టండి స్వాములవారూ.

లింగ : స్వాములవారికి చక్రకేళీ ఇష్టమని పెద్ద మార్కెటు నుంచి తెప్పించాను.

ఆనంద : చాలా సంతోషం.

రంగ : అతిథ్యం విషయంలో లింగరాజుగారి కొకరు చెప్పవలసిన పని లేదు.

లింగ : రంగనాథం గారూ, చూస్తారేమయ్యా, శేఖరం పుచ్చుకో నాయనా.

శేఖ : నా కాఫీ అయిందండి.

లింగ : అప్పుడే.

(వీధి తలుపు పెద్దగా కొట్టిన చప్పుడు)

లింగ : ఎవరదీ ఇంత రాత్రివేళ తలుపు కొడతారు.

రంగ : పట్నంనుంచి మీ చుట్టమెవరైనా వచ్చారేమో ?

లింగ : ప్రొద్దుగూకి వచ్చినచుట్టం వల్ల లావు చిక్కు.

రంగ : అందుకే పొద్దున్నే వొచ్చిన వాన, పొద్దుపోకి వొచ్చిన చుట్టం అన్నారు.

ఆనంద : వెళ్లి తలుపు తీయండి.

(తలుపు తీసిన చప్పుడు)

లింగ : ఆఁ. ఎవరునువ్వు ?

రాజా : లింగరాజుగారు మీరేనా ?

లింగ : అవును, ఏం ?

రాజా : నేను రావు శ్రీధరరావుగారి అబ్బాయిని.

లింగ : ఓయ్ నువ్వటోయ్. ఎంత మారిపోయ్యావ్ ! చాలా ఏళ్ల యింది. నిన్ను చూచి. ఎక్కణ్ణించి రావటం ?

రాజా : హైద్రాబాదు నుంచే వొస్తున్నా.

లింగ : ఏం, ఇలావచ్చావ్.

రాజా : నాన్నగారు పంపించారు.

లింగ : ఏమి టగత్యం.

రాజా ; నాకు తెలీదు. ఈ ఉత్తరమిచ్చి తమరు మీదగ్గరికెళ్ల మన్నారు.

లింగ : ఏమిటి సీలువేసిన ఉత్తరం.

రాజా : నాకు తెలీదండీ. మీరే విప్పి చదవాలని నాన్నగారన్నారు.

రాజా : ఈ సామాను నెవరిది ?

రాజా : నాదేనండీ. నా వస్తువులన్నీ తీసుకొని వెళ్లమన్నారు.

లింగ : లోపలికిరా.

రంగ : లింగరాజుగారూ, ఎవరండీ వస్తా ?

లింగ : మా మేనల్లుడండీ. అమ్మాయ్ లలితా, మీరు లోపలికెళ్లి పై గది కాళీచేయించండి.

లలిత : అలాగే నాన్నా.

ఆనంద : లింగరాజుగారూ, ఇక మేము వెళ్లివస్తాం.

లింగ : అలాగే స్వామీ.

శేఖ : నే వెళ్లొస్తానండీ.

లింగ : అలాగే నాయనా,

రంగ : నే సెలవు పుచ్చుకుంటాను. లింగరాజుగారూ.

లింగ : అలాగే వెళ్ళిరండి. చూడండీ రంగనాథంగారూ రేపోకమారు కన్పిస్తారా ?

రంగ : అలాగే లెండి. అలాగే.

(పావు నిమిషం విరామం ఆశాజనకమైన వాద్య సంగీతం)

లలిత : లక్ష్మి. అదొద్దు ఈ దక్షిణంవేపు గది బాగుంటుంది.

లక్ష్మి : ఔనమ్మా, గాలి బాగొస్తుంది.

లలిత : ఏమే, ఆ వచ్చినతనెవరో నీకు తెలుసే ?

లక్ష్మి : తెలవదమ్మా.

లలిత : మా బావటనే

లక్ష్మి : ఎంత అందంగా వున్నాడమ్మా. ఎప్పుడూ రాలేదే ?

లలిత : మరి ఇవ్వాళ వచ్చాడు. నా పుట్టినరోజు ఎంత మంచిరోజో చూశావా.

లక్ష్మి : నిజమే నమ్మా.

లలిత : ఆ ముక్కూ, మొహంటా, ఆ నిగనిగలాడే క్రాపూ, ఆ మెరిసిపోయ్యే సిల్కుసూటూ......

లక్ష్మి : ఆ ఒడ్డుపొడుగూ, ఆ వాలకం, ఆ మాటతీరూ......

లలిత : నీకుమాటలొస్తున్నాయే.

లక్ష్మి : మీ ఇద్దరికీ బలే ఈడుజోడమ్మా సమంధం కుదిరిందంటే చిలకాగోరింకల్లా ఉంటారు

లలిత : ఆఁ! అలాగా!! సరేగాని, అదేమిటి పక్కమీద అది పరుస్తున్నావ్.

లక్ష్మి : ఏమమ్మా ?

లలిత : వొచ్చిందెవరో తెలుసా ? పట్నం బావ, పెట్టెలోనుంచి గళ్ళ చద్దరు తీసుకురా.

లక్ష్మి : అదా సంగతి.

లలిత : ఇదిగో లక్ష్మి.

లక్ష్మి : ఏంటమ్మా ?

లలిత : బావకు మంచి చిక్కని కాఫీ ఇవ్వాలి. పట్నంవాళ్లు స్ట్రాంగ్ కాఫీ తాగుతారు తెలుసా?

లక్ష్మి : పరికొట్టు తాళాలు అయ్యగారి దగ్గిరున్నాయి. కదమ్మా.

లలిత : అక్కర్లేదు. నేడక్చిస్తాను. వెళ్లి కొనుక్కురా.

లక్ష్మి : నాన్నగారు చూస్తే.

లలిత : చూడరులేవే.

లక్ష్మి : ఏమోనమ్మా, ఎవరేం చేస్తున్నారా అని వెయ్యికళ్లతో చూస్తుంటారు.

లలిత : చూస్తే నేను సంజాయిషీ చెబుతాలే. బావకు మర్యాద చెయ్యొద్దూ.

లక్ష్మి : ఏం చేస్తారమ్మా. ఇచ్చిన బొగ్గులకి కూడ లెఖ్ఖడుగుతారు బాబయ్యగారు. తోముతున్న అంట్లు కూడా చూచి దేనిలో ఏమేమివండింది అబా కనుక్కుంటారు.

లలిత : అవన్నీ ఇప్పుడెందుకు లేవే. వెళ్లినే చెప్పినట్టు చెయ్యి.

(క్షణం విరామం)

లింగ : ఒసే, ఏమేవ్, ధనం.

ధనం : ఏమిటండీ ?

లింగ : ఆ వొచ్చిన కుర్రాడు లేచాడా, ఇంకా నిద్రపోతున్నాడా ?

ధనం : నాకు తెలియదు.

లక్ష్మి : మీ అల్లుడుగారాండీ ? రాజాలా నిద్రపోతున్నాడు.

లింగ : ఏమ్ లక్ష్మి. నిన్నడగలేదు. నువ్వు అవతలికి వెళ్లు.

లక్ష్మి : అలాగే బాబయ్యా.

లింగ : అమ్మాయ్ లలితా.

లలిత : ఏం నాన్నా ?

లింగ : ఆ పత్రిక ఇలా తే.

లలిత : ఇదిగో నాన్నా.

లింగ : ఐతే కుమారరాజావారు ఇంకా పవ్వళింపు సేవలోనే వున్నారన్నమాట. నింపాదిగా లేవనివ్వండి. చెడువార్త ఆలస్యంగా విన్నా పొయ్యేదేమీలేదు.

లలిత : చెడువార్తేమిటి నాన్నా.

లింగ : ఏమిటో. ఈ రాజావారి తండ్రిగారు వ్యాపారంలో బోల్తాలు కొట్టి దివాలా తీసి ఇంకా బ్రతికుంటే ఏం మూడుతుందోనని ఆత్మహత్య చేసుకుంటున్నానని వ్రాశాడు.

ధనం : ఆఁ! మరి ఇంత ఆలస్యంగా చెప్పారేం.

లింగ : ముందుగా చెబితే మాత్రం మనం అక్కడికెళ్ళి చేయగలిగిందేమిటి ? ఈ రాజావారు ఇక్కడికొచ్చేసరికి అక్కడ ఆ మహారాజావారు అంతర్ధానమై వుంటారు.

లలిత : (వెక్కుతూ) మామయ్యా !

లింగ : ఎందుకూ ఏడుస్తావ్ ?

ధనం : దాని మామయ్యకదండీ.

లింగ : ఆఁ, మామయ్య ! బ్రతికుండగా ఒక్కనాడైనా వొచ్చి చూశాడూ ?

లలిత : (ఏడుస్తూ) ఎంత పనిచేశావు మామయ్యా !

లింగ : అదుగో మళ్ళీ. ఏడవొద్దని సిక్కాడూ చెప్పేది.

ధనం : మనుషులన్న తర్వాత ఆ మాత్రం లేకుండా ఎలావుంటారు ?

లింగ : హుఁ, మనుషులు ! అతనూ ఒక మనిషే. మా చెల్లెలు బ్రతికుండగా ఏం ప్రతాపం చూపాడూ ! ఏం పోకిళ్ళు పొయ్యాడు!

ధనం : అవన్నీ ఇప్పుడా వొచ్చేది ?

లింగ : అహా, అప్పుడే మరిచిపొయ్యాం ?

లలిత : పాపం బావ దిక్కులేనివాడయ్యాడు.

లింగ : పోనీలే, దిక్కులేనివాడికి దేవుడే దిక్కు. ఎటో వెళ్ళి జీవనాధారం చూసుకుంటాడు.

ధనం : చూసుకుంటాడేమిటి. మీరే చూపండి.

లింగ : ఏమిటీ, ఇదెటువంటి ఇల్లూ, ఏమి కథా ! ఆ దివాలా తీసిన వాడికొడుక్కి ఇక్కడా జీవనాధారం ? వీల్లేదు. ఎక్కడికైనా వెళ్ళాల్సిందే. అతనబ్బ కూడా ఆ మాటే వ్రాశాడు.

లలిత : ఎక్కడికో ఎందుకు నాన్నా. బావ ఇక్కడే ఉంటాడు.

లింగ : దొత్తెరీ, నువ్వా ఇంటిపెద్దవు. నేనా ? (బిగ్గరగా) లక్ష్మీ, లక్ష్మీ.

లింగ : ఆ రాజావారు నిద్రలేచారా ?

లక్ష్మి : లేచి ఇప్పుడే కాఫీ త్రాగారు బాబయ్యా.

లింగ : ఉహు. మర్యాదల కేమీ లోటులేదన్నమాట. ఇలా అయితే నా ఇల్లు గుల్లయిపోతుంది. పెళ్లి అతగాణ్ణి ఇటు పంపు.

లక్ష్మి : అలాగే బాబయ్యా.

లింగ : మీరిద్దరూ ఇష్టమొచ్చినట్లు మాట్లాడుకుంటే నేను మనిషిని కాను. హు, ఉపపెత్తనం, తంబళ్ల పౌరసనం. ఇంటికి పెద్ద ఎలా చెబితే అలా మసులుకోవాలి.

ధనం : మీ ఇష్టం, ఏమైనా చేసుకోండి.

లలిత : బాగా ఆలోచించు నాన్నా.

లింగ : నాకు నువ్వేమీ ఆలోచన చెప్పక్కర్లేదు.

రాజా : పిలిచారా, మామయ్యా.

లింగ : అవును, ఇలా కూర్చో. ఒక చెడువార్త నీకు చెప్పాలి.

రాజా : చెడువార్తా, ఏమిటి మామయ్యా ?

లింగ : ఏముంది. గతించినవాణ్ణి గూర్చి.

రాజా : ఎవరు గతించారు మామయ్యా.

లింగ : ఎవరైతేనేమి ? మీ నాన్నే అనుకో.

రాజా : మా నాన్నా ?

లింగ : అవునయ్యా, దివాలాతీసి నిన్ను బికారిని చేసి తనదారిని తాను వెళ్లిపొయ్యాడు.

రాజా : (పెద్దగా) నాన్నా ! నాన్నా ! వెళ్లిపొయ్యావా నాన్నా ! (ఏడుస్తాడు)

లలిత : బావా !

లింగ : వెళ్లితే వెళ్లాడు. కాని నిన్నూ, నీ వంశాన్నీ సర్వనాశనం చేసి వెళ్లాడు.

రాజా : నేను సర్వనాశనమయినా ఫరవాలేదు. కాని నాన్న...... నన్ను అంత ప్రేమతో పెంచిన నాన్న పొయ్యాడంటే నా గుండె బ్రద్దలవుతూంది. నాన్న, నాన్న, (ఏడుస్తాడు)

లలిత : ఏడువకు బావా.

ధనం : అవును నాయనా, మగబిడ్డవు, ధైర్యంతో ఉండాలి.

లలిత : బావా, నువ్వు అలా ఏడుస్తూఉంటే మేము చూడలేము. ఊరుకో బావా.

లింగ : పోయినవాడికోసం ఏడిస్తే ఏం లాభమయ్యా, ధైర్యం తెచ్చుకొని ప్రపంచంమీద పడి ప్రయోజకుడివి కావాలి. మీ నాన్న కూడ ఆ మాటే వ్రాశాడు. నిన్ను బొంబాయి వెళ్లి వ్యాపారం చేసుకొమ్మన్నాడు. ముందు సంగతి ఆలోచించుకో.

రాజా : నాన్నా (వెక్కుతాడు)

(విషాదసూచక వాయులీనం)

రాజా : లలితా, నువ్వా, ఇంత అర్ధరాత్రి ఇక్కడికి !

లలిత : ష్, పెద్దగా మాట్లాడకు. వింటే ఇంట్లోవాళ్ళు లేస్తారు.

రాజా : వచ్చి ఎంతసేపైంది లలితా.

లలిత : ఇప్పుడే. ఒక తప్పుచేశాను బావా. నన్ను క్షమిస్తావా.

రాజా : ఏమిటది ?

లలిత : నేనీ రెండు ఉత్తరాలు చదివాను బావా.

రాజా : ఆఁ !

లలిత : చదవడం మంచిదైంది. ఇప్పుడు నీ హృదయాన్ని తెలుసుకున్నాను బావా.

రాజా : ఏం చెయ్యను లలితా. ఆ అమ్మాయి నన్ను అమితంగా ప్రేమిస్తూ ఉంది. కాని చిల్లిగవ్వలేనివాణ్ణి నేనామెకు తగును. అందుకే నన్ను మరచిపొమ్మని వ్రాశాను.

లలిత : బావా, నువ్వు బొంబాయి వెడతావు కదూ.

రాజా , వెళ్ళాలి, కాని ఏం పెట్టుకు వెళ్లను.

లలిత : నేనొకమాట చెబుతా వింటావా బావా.

రాజా ; చెప్పు లలితా. ఇన్నిరోజుల్నించీ నీ ఉపశమన వాక్యాలేగా నా దుఃఖాన్ని తగ్గిస్తున్నాయి.

లలిత : ఇదిగో, ఈ సంచీ తీసుకో. ఇందులో రెండు వందల కాసులున్నాయి. చిన్నప్పటినుంచీ నేను కూడబెట్టుకున్న సొమ్ము. నీకు అక్కరకొస్తుంది,

రాజా : (మాట్లాడడు)

లలిత : అలా చూస్తావేం బావా ? ఆడదాని సొమ్మనుకుంటున్నావా. పోనీ అప్పుగాతీసుకోకే.

రాజా : (మాట్లాడడు)

లలిత : చెప్పు బావా, తీసుకుంటున్నా అని అను. ఈ సొమ్ము నీకు తప్పకుండా అదృష్టం తెస్తుంది. నువ్వు మళ్లీ ఇచ్చినాసరే. లేదు, నీకిష్టమైతే అది మనిద్దరిసొమ్ము అయినా సరే.

రాజా : లలితా !

లలిత : ఏం బావా.

రాజా : మీ నాన్నగారు, నీవూ ఎంత మంచివారు! మరి నేను నీకొకటి ఇస్తాను, దాన్ని పదిలంగా దాచి తిరిగి నాకిస్తావా.

లలిత : అలాగే బావా. ఏమిటి, బంగారపు పెట్టా.

రాజా : అంతకంటే అమూల్యమైనది. లలితా. ఉండు తెస్తా. ఆ, ఈ చిత్రాలు ఎవరివో తెలుసా, మా అమ్మా, నాన్నవి.

లలిత : ఈమె మా అత్తయ్యా, బావా ?

రాజా : అవును లలితా.

(సశేషం)

కవిత :

# సెలకన్నె

-శ్రీ వై. సి. వి. రెడ్డి

కూట పాకలమ్మ తోడ
కుంది కుంది గంధగజము
బుడ్డీనోగ్రమ్మైన
యున్నత హస్త్రాం సథము
లూటాపిగ తూటాపిగ
నున్న మితంబైన యార్తి
నిటువేపే పరుపు రెత్తె
చటుల తాపమూల నీవు
కౌగిలిలో శాంతి బొంది
కష్టాలను నెట్టివేయ
కామన జేసినవేమొ !
కమనీయ రసోల్లాసిని !
ఆవరించి యప్పుటంహూరు
అందు దోఁగి తనువు నొంద
నను మతింతువా రేహా ?

యేమమ్మా సెలకన్నె
యెక్కడ **నుండి** రాకద ?

విధివశాన దూరాంకపు
విరిగి పోయి తరిగి పోయి
తునకలయ్యె రెక్కగములు
తొలికించెను కాంతిపూర

మమృతాత్మకు లంతుచేసి
యాదరమే చూపుతారు;
వారేనా తొలి నాళల
బడి నీతో నృత్యగతుల
బరవశగతి చెల్లించుచు
పరహిత మే పరమావధి
గా వెల్గుచునున్నవారు
వారితోడ నీవు కూడ
ప్రభవించితి వను కొంటును;
సోదరులకు ఆట నేర్పు
శోధనముల తూగుటోన
మిట్టలారసి పల్లము బడి
మిన్నందిన యానందము
పొంగువార మధురోహల
పోకల పోవుచు నుంటివి,

ఏమమ్మా వెంకన్నె
యెక్కడి నుండి రాకడ?

ధరణీ ధర సానుతటుల
చిరహాసము తోడ పవ్వ
లెత్తు నిన్ను హృదయాలకు
హత్తుకొన్న మా ఘామికి
మేలు చేయ దలపెట్టిన
మెలతా! నీ హృదయ సౌరు
మార్య మింతలని చెప్పగ
మాతోనా!—కాదు కాదు;

నీతోనే సర్వసృష్టి
నిక్కమన్న తప్పేమది
నిక్కువమ్ము-లీ కానన
నికరమ్ముల పుంజుకొన్న
అనలు కొనలు సాగియాగి
అల్లుకొన్న పూదీగెల
పొదలు-పొదలు తుమ్మెదలును
పొంది పొసగి యానందము
నందుచున్న సత్వమ్ములు-
అంతా నీ దయ గాదా ?
అంతా నీ చలువే మరి-

యేమమ్మా నెలకన్నె
యెక్కడి నుండి రాకద ?



గ్రంథ స్వీకారం

అలెగ్జాండర్ (నాటకం) —శ్రీ మధురశ్రీ
శ్రీ మద్భాగవతము.
(ప్రథమ, ద్వితీయ, తృతీయస్కంధములు)
ఆంధ్రవ్యాఖ్యాత.
శ్రీ పురాణపండ రామమూర్తి

# ఆముక్త మాల్యద

—శ్రీ పప్పూరి రామాచార్యులు

(గతసంచిక తరువాయి)

## యామునాచార్య వృత్తాంతము

ఒకనాటి మధ్యాహ్నమున శ్రీవిష్ణుచిత్తులవారు యథారీతిని స్వామికి మాలికాసమర్పణము చేసి గృహమున కేగుచుండగా పుండరీకాక్షుఁడు తన దేవితో నిట్లనెను. "దేవి, యామునాచార్యు డొక్కఁడు, ఈ మహాత్ము డొక్కఁడు వైష్ణవ మతము నుద్ధరించిన వారిలో నగ్రగణ్యులు." అనుటయు నా పుండరీనిలయ "స్వామి, ఈతని కథ యెఱిగినదే కదా, యామునాచార్యు లేమియొనర్చి," రని ప్రశ్నించెను. స్వామి యామునాచార్యుని కథ నీ విధముగా చెప్పదొడగిరి.

"దేవీ, పూర్వము మత్పదాశ్రితు డొక్కఁడుండెను. చిఱుతనాడే అతడు ఆచార్యకులమున వేదశాస్త్ర విద్యలనభ్యసించుచుండెను. ఇప్పటి పాండ్య రాజునకు పూర్వుఁడొక్కఁడు, అప్పుడా రాజ్యమునకు ప్రభువు.

ఆ రాజు శైవుడు. శైవము ముదిరి అతడు ఇతర దేవతలను ద్వేషించెను. విష్ణు స్తుతివినడు. విష్ణు విగ్రహములకు నమస్కరింపడు. వైష్ణవాలయముల కడప ద్రొక్కఁడు. ఆ యుత్సవముల కసూయ జెందును. అతనిని పరివేష్టించినవారు అతనికంటెను ఉన్మాదులు.

ఆ రాజు జంగముల పూజయందు నిరంతరము శ్రద్ధ గలవాడు. వేద విద్విజులను నెట్టివేయును. ఇతర గృహదైవతముల దిక్కు చూడడు. గణా ర్చనను ఆడంబరముగా జరిపించును. జంగములకు మఠములు కట్టించును గాని పురాతన దేవాలయములు శిథిలములగుచుండగా వానిని బాగు చేయింపడు. ఉత్తరశైవము నాదరించి యజ్ఞోపవీతమును త్రెంచివేసెను, శివారాధనా తత్పరుడగు నాతనికి జంగమయ్యలు తప్ప ఏ యితర మతా చార్యులును ఆదరణపాత్రులు కాకపోయిరి.

అంతే కాదు, లింగధారులు ఏ దుష్కృత్యము లొనర్చినను, ఇది పాపమనడు, వారిని దండింపడు, తన మతము నొప్పుకొని ప్రశంసించు కష

చేర్చిన రెండవచేయి ఆయన రాచఠీవిని చాటుచుండినవి. నందిముద్రిత అంగుళీయకములు ఆయన వ్రేళ్ల వెలుగుచుండినవి. చెవులలో బంగారు పొదవిన చిన్న రుద్రాక్షపోగులు ఆతనికి వింత చెలువును గూర్చినవి. ఆ మహారాజు శిరోవేష్టనపు కొంగులు బయటికి దోప దువ్వలువ కప్పుకొని యుండెను. ప్రక్కన తాంబూల కరాటమును వాడివాలును ఒక్కయువ తె దాల్చినిల్చుండినది. భార్య వింజామర గలిగి యుండినది. లింగ ధారి జంగములు చెప్పు ఆగమములను ఆయన వినుచుండెను.

అట్టి మహారాజును చూచి వినతుడై సమీపించి యామున కుమారుడు యజ్ఞోపవీతంబు కానుక పెట్టి కూర్చుండెను. మహారాజు ఆ వటువు నాదరింపలేదు. నిరసనగా నిట్లనెను,

"ఓయీ, ఇసుమంత టింగణావు. తత్త్వ నిర్ణయవాదము నీకు తరమా? ఓడిపోతివా నీవు మెట్టోయని పడ్చినను పినక నీకు లింగమును కట్టి విడచెదను. ప్రజ్ఞ కలిగి మాటాడుము.

"ఈ బ్రహ్మణుల సంగతి మేమెఱుగుదుము, వాదులమని చెప్పి వత్తురు. ఓడి పోయిన తర్వాత దయతో ఏమైన ఇచ్చి పంపుడని లజ్జ లేక యాచింతురు. మోసముతో నెగ్గో సభలలో చౌరవ చేసికొందురు."

అని భార్య వంక తిరిగి ఆ మహారాజు "నామతస్థుడోడెనా, నేను భస్మమును, రుద్రాక్షలను మానుకొని తప్త చక్రాంకితుడగా గలను. నీ విద్వాంసు డోడెనేని వానికి శాపింతుమన్నదే నీకును" అనెను.

దరహాసముతో నామె "ఒప్పుకొనెదను. దేవర ప్రతిజ్ఞ తప్పకున్న జాలును. ఇందుకు పంచ భూతములే సాక్షి" అన్నది. యామునుడు కృష్ణాజినము పెళ పెళ యనగా చేపట్టిన మోదుగకోల చలింపగా, చేతులు జోడించి వినీతుడై ఇలికి ఇట్లు విన్నవించుకొనెను.

"దేవా! అట్లు ఆజ్ఞాపింపకుడు. నేను కడుపు కూటికిట్లు వచ్చిన వాడనుగాను. మీ వలన డబ్బును సేకరించి నేనెవ్వరిని పోషింపవలసి యున్నది? బ్రహ్మచారికి భిక్షాజీవిక విధి నియమముగాదా!

సర్వభూతస్థు డెవ్వడో అతడే నన్నిటనికి ప్రేరేచెను. అతని ఆజ్ఞానుసారమే వచ్చినవాడను. తెలిసిన నాల్గు మాటలను అతని మీదనే భారము వేసి నొడివెదను. ఆయనయే బొంకిన, నేను చేయగల దేమున్నది! వాదము లో నోడితిగా అమ్మ తప్పిన విద్వాంసుడవను మోమోట లేకుండ నీ ప్రతిజ్ఞ

శిర వేర్పుము" అని అలుకను విడిచి పలికి రాజానుమతిని వాదమునకు దొడంగెను.

ప్రతివాదులలో నొక మేటికభిముఖుడై అతడు చెప్పిన యుక్తులను మరల ననువదించి గ్రహము చేసికొని వానిలోని దోషముల నొకటి వెంట నొకటి సభవారు ఒప్పుకొనునట్లు వేగపడకుండ నిరూపించి ప్రతివాదులు దొమ్మిగా ప్రసంగింపగా శ్రోత్రియుండక ఒక్కొక్కనినే సమాధానపరచి మరల మొదటి వాని వంక తిరిగి వాని వాదమును ఖండించుచు శ్రుతిస్మృతి సూత్రసమాజ మునకు ఐకమత్యము కల్పించుచు స్వమత సిద్ధాంతమును సాధించెను.

తర్వాత రెండవ వానివంక దిరిగి నీవేమంటివి రమ్మని వానినట్లే విజితుం గావించి వాడు సరణిలో పటువు నందిఅను గెలిచెను. ఇట్లు గెలిచి విష్ణుదేవుండే పరతత్త్వంబనియును, విశిష్టాద్వైతంబె మతమనియు ప్రతి ష్ఠించెను.

"ఓహో ఇది సత్యము, రాజా, నారాయణుడే పరము. అతనికొల్వు" మని ఎదుటనుండెడి అశ్వత్థ వృక్షము నుండి ఒక పలుకు వినబడినది.

మహారాజు అతని సుపాండిత్యంబునకు సంతోషించి సాష్టాంగమెఱగి ఆనంద కందళిత హృదయారవిందుడై, నారాయణునందు భక్తిపారమి కృతార్థుడయ్యెను. అంతేకాక ఆ మహారాజు బ్రహ్మచారియగు నతనికి తన కడ గొట్టు చెలియలనిచ్చి పరిణయంబు చేసి అరణంబుగా నర్ధరాజ్యంబిచ్చి యువ రాజును గూడ చేసెను.

యామునాచార్యుడు వేద విద్యలయందే కాక ధనుర్వేదమునందును ప్రవీణుడనియును, దివ్యాస్త్ర మంత్రముల కలిమిగల వాడనియు మహారాజు తెలిసికొని దుస్సాధంబగు విరోధి యూథంబు సాధింపుమని అతనిని దండ యాత్రకు నియోగించెను. కాని పురోహిత మంత్రులు వర్షర్తువును కడపి శరత్సమయంబున శత్రు సంహారమునకు విజయంబు చేయ ప్రార్థించిరి. రాజును అందుకు సమ్మతింపగా యామునుడు పట్టణమునందే నిలిచెను.

(సశేషము)

కవిత

# పరివర్తన

— శ్రీ ఆర్. కె. మొగసాటి

ఇది వొక చొక్కా!
బహు చక్కనిది-సిల్కుది
నా కొలతకు చాలి నిన్న
నాకు చాల దేమి నేడు?

జగత్తునిండా పిచ్చుకలూ-గూండ్లూ
చిన్నవి-పెద్దవి-యెన్నో రకములు
యెవరికీ పడి లేచే లిల్లీపుట్లు?
కాదా యిది నిన్నటి భూగోళం!

వీ రిచ్చిన టిక్కెట్టులు
చేర్చు మనల శూన్య నగరి
ప్రియముమీర పిలిచి వారు
చూపింతురు శిథిలాలను

నిజ మారడుగుల మనిషిని
నా తలకు తగులు నేమి నభము?
తృప్తిని నాకుక్షిని తేన్చినాను
అయినా కలుగదు ఆనందం!

నా కిక్కడ వుందెంతో పని
పని తీరదు-మరి పయనం తప్పదు
యీ కూడలిలో కూసే బండలు
నను చేర్చవు నా గమ్యానికి

వీరి నిర్ణయాలలోన
లేదు నేటికి వెనుక ముందు
మునుముందుకు పోదు నేను!
ప్రగతిచేర బోదు నిపుడె!!

తలచిన వలపులు పులిసి—
యిక జీవిక వెగటుగ దోచి—
న స్నమగమించి యీ లోకం
విలోకించు మరో ప్రపంచం!!!



**పుస్తకపరిచయము :**

# భ్రమర గీతలు

| రచన | ప్రచురణ |
|---|---|
| శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి | గోదా గ్రంథమాల |
| వెల : రు. 1.00 | శ్రీమన్నారాయణ పురము |
| | ఉల్లిపాలెంపోస్టు. దివితాలూకా |
| | కృష్ణా జిల్లా |

సూరదాసు, హిందీలో భాగవతము రచించిన భక్తకవి. ఈతనిని పోతనతో పోల్చుట హిందీ అభిమానుల సంప్రదాయము. భ్రమరగీతలను పేరున గోపికలు ఉద్ధవునితో అన్యాపదేశముగా చెప్పిన పల్కులు ఈ పాటలకు ఇతివృత్తము. సూరదాసు పాటలలో గుస్తరించిన యీ కవిత, తెనుగులో వివిధ వృత్తములలోనూ ద్విరదగతిరగడలలోనూ కవిగారు రచించినారు. వీరే తులసీరామాయణము ఇదే ఫక్కిలో అనువాదం చేశారు. వీరి పద్యములలో ఛందస్సుకంటె, రగడలలో శయ్య చక్కగా ఉన్నది.

గోకులా దాసులము గోపాల దాసులము
    మాకులము గోకులము మన్నించు వ్రజకులము
ఆ యశోదా సుతోపాసనా లోలలము
    తీయమునహారి సజాతీయులము సకియలము

ఆబాలగోపాల మందరము మామంద
    వాబాలగోపాల కారాధకుల మింద
మందుక వినరు మామంద నీబోధనము
    ముందుకే గొనరు నేమము యోగసాధకము.

ఈ ధోరణిలో నడచిన యీ భ్రమరగీతలు భక్తిరసాభిమానులు చూడవలసినవే.

మూలమును అనువాదమును పోల్చిచూచినచో మాత్రము కొంత వ్యత్యాసము లేకపోలేదు.

సూరదాసు : ప్రేమ ప్రేమతేహోయి, ప్రేమతే పారహి గయియే
    ప్రేమబంధ్యో సంసార్, ప్రేమపరమారథ్ లహియే
    ఏకై నిశ్చయ ప్రేమకో జీవన్ ముక్తిరసాల్
    సాంచో నిశ్చయ ప్రేమకో జేహితే మిలై గోపాల్

ప్రేమయె ప్రేమమూలమగు, విశ్వమదెల్లను ప్రేమబద్ధమౌ
ప్రేమయె మోక్షసాధనము ప్రేమయె జీవనముక్తి హేతువున్
ప్రేమయె సార్థకత్వ మొదవియును ప్రేమయె తారకంబు మా
ప్రేమయె నిక్కమే నెడలభించును నందసుతుండవశ్యమున్॥

—శ్రీ వాత్సవ

# మహారాణా బాప్పా

## (నవల)

రచన : సదాశివరావు. భారతీ సాహితి

పేజీలు. 202. వెల మూడు రూపాయలు. విశాఖపట్టణం.

[illegible] దేశాయి గుజరాతీలో వ్రాసిన కథాంశాన్ని ఉపయోగించుకుని స్వేచ్ఛా పద్ధతిలో రచింపబడ్డ చరిత్రాత్మక నవల యిది.

భిల్లులచే మహేంద్రుడు ఓడింప బడడం—బాల భోజుని హారితముని రక్షించి తీసుకు పోవడం-శస్త్రాస్త్ర విద్యలు నేర్పి భోజుని పరాక్రమ పాండిత్యములందు నిపుణుని చేయడం-తర్వాత మేవాడ్ సంస్థానాధీశునిగ భోజుడు పట్టము పొంది, మీనాక్షిని వివాహం చేసుకోవడం-అంత్యకాలంలో సన్యసించి తన రాజ్యము కొడుకున కప్పగించి, భారత దేశములోని హైందవ సాంప్రదాయాల ఉద్ధరణకు పూనుకోవడం-ఇందలి కథా సారాంశం.

చరిత్రాత్మక నవలల్లో, చారిత్రిక వివరాలు కొన్ని మూలాధారంగా చేసుకుని కల్పనకు ప్రాధాన్యత యిచ్చి రచన సాగుతుంది. పాత్రల ఔచిత్యం, సన్నివేశాల పటుత్వం, పాఠకుని చారిత్రిక విజ్ఞానం. ఆసక్తి మీద ఆధారపడి ఉంటుంది. వాస్తవికతను అర్థం చేసుకున్నంతగా సామాన్య పాఠకుడు ఊహా కల్పన ద్వారా చిత్రించబడిన వాస్తవిక దూరమైన సన్నివేశాలను ఆమోదించి, హర్షము వెలిబుచ్చడం అరుదు. భోజుని బలపరాక్రమ సాహసాలపై చారిత్రకంగా నమ్మకకల్గినప్పుడే యిట్టి రచనలు ఆదరించ గల్గుతాడు పాఠకుడు.

చారిత్రక నవలలలో చారిత్రిక సత్యాలు ప్రతిబింబించడం చాల కష్టం. గతంలోని తెలియని విషయాలు, కథా గమనంలో, చిత్రాలలో, సన్నివేశ ప్రదర్శ

నతో ఊహతో బలాన్ని ఆధారం చేసుకుని కదులుతాయి. వాస్తవికతకు సన్నిహిత సృజనాత్మక రచనలు వెలువడే యీ రోజులలో చారిత్రాత్మక నవలలు చారిత్రిక సత్యాలు నిర్దుష్టంగా, ఆకర్షణీయంగా చెప్ప గల్గితే గాని సాహిత్యరంగంలో ఆదరణ పొందజాలవు.

అనువాదకుని ఆసక్తి, ప్రయత్నం, హర్షణీయమే కాని, యీ నవలలో సాహిత్య ప్రయోజనాలు సిద్ధించటానికి కాలం అతీతమైనదనిపిస్తుంది.

—పోతుకూచి

# తరంగిణి

కావ్యకర్త :
శ్రీ భమిడిపాటి రామసోమయాజి
వెల రు 1-25 న.పై.

ప్రతులకు :
గ్రంథకర్త
చోడవరం
విశాఖపట్నం జిల్లా

19 వ శతాబ్దం ఉత్తరార్థంలో పాశ్చాత్య సాహిత్య ప్రభావంవల్ల ఆంధ్ర కవితా రీతులలో నూతనత్వం పొడ జూపినది. అదే సమయంలో పాశ్చాత్య దేశాలలో షెల్లీ, కీట్సు, బైరన్, వర్డ్సువర్తు, కాల్రిడ్జ్, విక్టరుహ్యూగో, ఎడ్గార్ పో, స్విన్ బర్న్ మొదలగు మహాకవుల సాహిత్యోద్యమాలు ప్రచారంలో ఉన్నాయి. ఆ శతాబ్దంలోనే "రొమాంటిసిజం" అను ఉద్యమం ఆంగ్ల సాహిత్యానికి స్వర్ణయుగ మను ఖ్యాతి గడించినది. 'రొమాంటిసిజం' అనగా సాహిత్యంలో స్వేచ్ఛ. దీనినే ఆధునికాంధ్ర కవులు "కాల్పనికోద్యమం" లేక "భావ కవితోద్యమం" అని, దాని లక్షణాలు గలిగిన కవిత "కాల్పనిక కవిత్వం" లేక "భావ కవిత్వం" అని పేరు పెట్టారు.

భావకవిత్వం యొక్క ప్రధాన లక్షణాలు స్వేచ్ఛ, నూతన మార్గాన్వేషణం హృదయమునందలి నిరాశ, అశాంతి, దుఃఖము భావకవులు తమ కవితావస్తువుగా గ్రహిస్తారు. ప్రకృతి వీరి కారాధ్య దేవత. భావ కవులలో పలువురు ప్రేమోపాసకులు. వీరు హృదయ ప్రాధాన్య వాదులు. ఆత్మానుభూతి లేని రచనకు ప్రాధాన్య మివ్వ జాలరు.

ప్రథమ ప్రపంచ మహా సంగ్రామమునుండి ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామం వరకు భావకవిత్వం మహోజ్జ్వలంగా విలసిల్లిన కాలంలో అనేక మంది యువ [illegible]

భావకవిత్వ రచనకు మార్గదర్శకులు గురజాడ అప్పారావు. రాయప్రోలు సుబ్బారావు గార్లని తలంచ బడుచున్నది. ఈ సందర్భంలోనే దేవులపల్లి కృష్ణశాస్త్రి గారిని గురించి రెండు మాట లుల్లేఖించక తప్పదు. వారి 'కృష్ణ పక్షం' భావకవితా సాహిత్యానికి ఒక మణి పూసగా భావించ బడుచున్నది. విద్వాన్ విశ్వంగారన్నట్లు "భావనకొక ఆర్ద్రతా, భాషకొక మృదులతా, రీతికొక సరళతా" ఒనరించిన కృష్ణశాస్త్రి గారికి భావ కవితలో ఒక ప్రత్యేక స్థాన మున్నది. కాని కృష్ణశాస్త్రి గారి గేయాలలో ఆంగ్ల కవులైన షెల్లీ, కీట్సుల 'లిరికల్' ధ్వనులు ప్రతి ధ్వనిస్తుంటాయి. "ఏదియో అపూర్వమధుర శక్తి స్ఫురియించు గాని యర్థమ్ము గాని భావ గీతమ్ములివి..." అనే కృష్ణశాస్త్రి గారి 'ఆమె కన్నులలోని' పంక్తులు వహించి భావ కవిత్వమంతా అర్థం కాని నిరర్థక కవిత్వమని కొంత మంది విమర్శకులు తలంచు చున్నారు.

భమిడిపాటి రామ సోమయాజి గారు రచించిన "తరంగిణి" భావ గీతాల సంపుటి కాబట్టి భావ కవిత్వం యొక్క పుట్టు పూర్వోత్తరాలు, భావ కవిత్వపు లక్షణాలు శాఖా చంక్రమణంగా వివరించవలసి వచ్చింది. ఈ కావ్యంలో 28 శీర్షిక లున్నాయి. గ్రంథం మీద ముద్రించిన రచయిత పరిచయాన్నిబట్టి వీరు కవి, గాయకుడు, చిత్రలేఖకుడు, నటుడు, నాటక కర్తగా తెలుస్తున్నది. కాని వీరి పేరు ఆంధ్ర దేశంలో అంతగా ప్రసిద్ధి జెంద లేదు, బహుశః వీరు న్యాయవాద వృత్తిలో ఉంటూ విభిన్న రంగాల్లో కృషి చేయటం కారణం కావచ్చు. ఏమైనప్పటికీ రామ సోమయాజి గారు ఇలాంటి కావ్యాన్ని రచించినందులకు వారిని అభినందించ వలసిందే. వీరిని భావ కవులని నిరూపించటానికి వారి 'ఇంకొకసారి' లోని కొన్ని గేయ పాదాలను పరికించండి:

'గడియ గడియకు నా మనో గగన సీమ
క్రమ్మి క్రిక్కిరి యున్నరంత గాఢ దుఃఖ
మేఘ పటలమ్ము మది పొలిమేర దాటి
చెదిరి పోవగ వీచెడి సిత విలోక
నానిల తరంగములోని అమృతరసము
జల్లు ప్రేయసీ! మరియొక్క సారి నాదు
బ్రదుకు తిమిరంపు ముంపు దోవల వెలుంగు
నీదు చిరునవ్వు లేత వెన్నెలల పాట
ఏది, పాడుము ప్రేయసీ యింకొకసారి'

భావ కవితలో ప్రేమ సాధనమే గాని, సిద్ధి పొందగదు. భావ కవులకు నిరాశ యందు ఆశ, అసంతృప్తి యందు తృప్తి, దుఃఖమునందు సుఖము సాక్షాత్కరిస్తుంది. ఈ కావ్యమునందు కూడా అదే పద్ధతి గోచరిస్తున్నది. 'కృష్ణ' లోని [illegible] గమనించవచ్చు.

'ఎన్నియో వెన్నెలలు క్షణమేని గాని,
నీదు శోకంపు వాకిట నిలువనోప
కరపి యరయక కన్నీటి తెరలదాటి
సాగిపోయిన వెన్నియో శారదాభ్ర
నీల సుందర రాత్రులు నీ విషాద
గీతి కాలోకమున కను మూత వైచి
ఒడ లెరుంగని నిదురలో బడియె చెలియ.
ఎన్నిసారులో నీ ప్రేమ నెరుగ లేక
దుడుకు టడుగుల నీ యింటి త్రోవద్రొక్కి
వెనుదిరిగి పోయితిని దుఃఖ వీధి వెంట!'

పీఠికలో ప్రస్తావించ బడినట్లుగా ఈ గ్రంథం రెండు భాగాలుగా కన్పిస్తున్నది. మొదటి భాగం భావ కవితా మార్గాన నడచి "యథార్థ ప్రేమ" తో సమాప్తి చెందినది. 'స్వరాజ్య వైజయంతి' 'శ్రీ ఆంధ్ర రాష్ట్రాభ్యుదయము' అను రెండు శీర్షికలు మాత్రమే రెండో భాగం. రెండో భాగంలోని కవిత ప్రాచీన కవుల పద్ధతిని పుణికి పుచ్చు కొన్నట్లు ప్రౌఢంగా నడచినది. ఈ రెండు శీర్షికలు ప్రబోధ సాహిత్యానికి సంబంధించినవి. మచ్చుకొక పద్యం చూడండి:

త్రాగరే తుంగభద్రానదీ నిర్మల తోయమ్ము లిప్పుడా ధునికు లెల్ల?
కృష్ణా తరంగిణీ కీర్ణస్థలీ ధాన్య మారగింపరె నేటి వీరులైన?
గోదావరీ పవిత్రోదక పూజ్యమౌ నేల జీవింపరే నేటి ఘనులు?
నాగావళీ యనంత ప్రాభవావని వసియింపరే నేటి ప్రముఖవరులు?

తెలుగు గుండెల మరగించు తీవ్రరక్త
వాహినీ నిర్మలాశా ప్రవాహ వేగ
మాగిపోలేదు యీనాటికైనగాని
ఆంధ్రు డాంధ్రుడె లోక మేమయ్యెనేని!

ఈ విధంగా రామసోమయాజిగారి కవితలో వైవిధ్యం గోచరిస్తున్నది. తరంగిణిలో ఒకప్పుడు చిన్నతరంగములు మరొక్కప్పుడు పెద్దతరంగములు రావచ్చును. ఈ విధంగా చూచిన ఎడల ఈ గ్రంథనామం "తరంగిణి" కూడా సార్థకముగా నున్నది.

భావకవితాభిమాను లీ కావ్యమును చదివి అందరి రసాస్వాదన చేయుదురు గాక!

—త్రిపురనేని సుబ్బారావు

# గాంధీగీత

రచయిత : గొట్టిపాటి సుబ్బరాయులు, మూల్యము : రూ. 1.00

వికాసప్రచురణ, అనంతపురం.

ఇది గాంధీజీ సందేశాన్ని ప్రబోధాత్మకంగా వినిపించే "గీత" కాదు. కేవలం గాంధీజీ జీవితాన్ని వర్ణించే పద్యాల సంపుటి మాత్రమే. "తెలుగు మూడవ తరగతి వరకు మాత్రమే చదువుకున్న నేను గ్రంథరచనకుద్యమించటం సాహసము. పద్యరచనకు పూనుకోవడము దుస్సాహసము. సహృదయులు అశక్తతను మన్నించి, గుణలేశమును స్వీకరిస్తారని ఆశిస్తున్నాను." అని రచయిత ప్రకటించారు. నిజానికి కవిత్వానికి ముఖ్యంగా కావలసింది పాండిత్యం కాదేమో. హృదయస్పందం దాని నాదం. ఇదిఎంతో అంతవుంటె, పాండిత్యప్రకర్ష లోపించినా, ఇబ్బంది వుండదు. కాని ఈ హృదయస్పందమే ఈ రచనలో వినబడదు. గాంధీజీ జీవితంలో జరిగిన సంఘటనలను ఏకరువుపెట్టటం మాత్రం జరిగింది. అది పద్యరూపంలో జరిగింది. అంతే. రూపంవరకే గాంధీజీ అంతటి వాని జీవితాన్ని ఇతివృత్తంగా తీసుకొన్నప్పటికీ, ఈ రచన సాధారణ కవితాస్థాయినైనా అందుకోలేక పోవటం విచారకరం. అక్కడక్కడ చిగుళ్లు కన్పించకపోవు.

గాంధీజీ హత్య సందర్భంలో శ్రీకృష్ణుడు లెనిన్ కూడా "అన్నదమ్ములైన వారలచేతనే అహుతైరి" అని అన్నారు రచయిత. ఇది పొరబాటు. శ్రీకృష్ణుని చూడక, తెలియక ఎవడో బాణం విడిచాడు. ఇక లెనిన్ ప్రాణాలను ఎవ్వరూ తీయలేదు. బహుశః ఈ పొరబాట్లను రచయిత గుర్తించే వుంటారు. వ్యవధిలేనందున రచనలో కొన్ని పొరబాట్లు జరిగిన వన్నారు.

గాంధీజీ జీవితంపై చూపుపడ్డాక, తదను గుణమైన కవిత కూడా ఈ రచయితకు సిద్ధించి తీరుతుంది. రచయిత పద్యనియమాలనే కాక, కవితా రీతిని కూడా అనుసరించి, మంచి కావ్యాన్ని అందిస్తారని ఆశిద్దాం. ఇలా అసలు యుగపురుషుని వైపు ఈ కవి మొగ్గటం ప్రశంసనీయం. పాఠశాలాధ్యయనం లేకపోవటం కవికి నిరుత్సాహకరం కాకూడదు.

—హాసన